**Rah-e-Haq ke Do Musafir**
**(Telugu)**

# బహుదూరపు బాటసారి

*మూలం :*

**మౌలానా ముహమ్మద్ యూసుఫ్ ఇస్లాహి**

*తెలుగు సేత :*

**ఆబిదా హుమైరవి**

# మా మాట

నిర్మాణం - విచ్ఛిన్నం ఇవి రెండు పరస్పర వైరుధ్య గుణాలుగా కనిపించినా వీటి మూలం ఒక్కటే. నిర్మాణం లోపభూయిష్టంగా ఉంటే అది విచ్ఛిన్నానికి దారితీస్తుంది. విచ్ఛిన్నం కాకుండా ఉండాలంటే నిర్మాణం పటిష్ఠంగా ఉండాలి. ఆ విధంగా నిర్మాణం విచ్ఛిన్నం ఒకే నాణానికి బొమ్మా బొరుసులు. సమాజానికి కూడా ఇదే సూత్రం వర్తిస్తుంది. ధార్మిక, నైతిక విలువల పునాదులపై మాత్రమే ఓ సత్సమాజ నిర్మాణం సాధ్యమౌతుంది. దాని నిర్మాణంలోని వాసి దాని కార్యకర్తల నైపుణ్యంపై ఆధారపడి ఉంటుంది.

అలాంటి నిర్మాణంలో కార్యోన్ముఖులు కావటానికై తగు ధార్మిక పరిజ్ఞాన సముపార్జనకై ప్రస్థానించిన ఎందరో మహానుభావులతో మహాప్రవక్త ముహమ్మద్ (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) అనుచరులలో ఒకరైన హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి), ప్రముఖ ఇస్లాం పండితులు ముహమ్మద్ ఇబ్నె ఇద్రీస్ షాఫిఈ (రహ్మా) వారి ప్రస్థాన గాథలను తెలిపే మౌలానా యూసుఫ్ ఇస్లాహీ గారి **'రాహె హఖ్‌కే దో ముసాఫిర్'** అనే ఉర్దూ మూలానికి ఆబెదా హుమైరవి గారి తెలుగు అనువాదమే మీ చేతిలో ఉన్న ఈ చిరుపుస్తకం. ధర్మజ్ఞాన సముపార్జనకై సాగిన ఆ ఇద్దరి గాథలు పాఠకులకు స్ఫూర్తి దాయకమౌతాయనటంలో ఎంతమాత్రం సందేహం లేదు..

**- ప్రకాశకులు**

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# హజ్రత్ సల్మాన్ ఫార్సీ (రజి)

అదొక ముచ్చటైన కుగ్రామం. ఈరాన్ దేశంలోని అస్ఫహాన్ ప్రాంతంలో వుంది. నేను ఆ ఊరిలోనే పుట్టాను. మా అమ్మా-నాన్న నన్ను 'మాబా' అని పిలుస్తారు. నన్నెంతో ముద్దుగా చూసుకుంటున్నారు. మా నాన్నగారు 'జీ'గారు అంటే జమీందారు. మంచి పేరు ప్రతిష్ఠలు గలవారు. మేము "మజూసీ" మతస్తులం. అంటే అగ్ని ఆరాధకులం! నేనంటే మా నాన్నగారికి వల్లమాలిన ప్రేమ. రెప్పపాటు కాలం కూడా నన్ను తన దృష్టికి దూరం కానివ్వరు. వయసొచ్చిన ఆడపిల్లలా నన్ను ఎప్పుడూ గమనిస్తూ అదుపులో పెడుతూ ఉంటారు. గడపదాటి బయటకు వెళ్ళనివ్వరు. ఎప్పుడయినా పొలం పనుల పర్యవేక్షణకు ఆయన వెళ్ళవలసి వస్తే నా గురించి జాగ్రత్తలు చెప్పి వెళ్తారు. బయటకు వెళ్ళకుండా గమనిస్తూ ఉండవలసిందిగా ఇంట్లో వారిని హెచ్చరించి వెళ్తారు. తత్ఫలితంగా ఆడపిల్లవలె నేను ఇంట్లోనే పడి ఉండవలసి వచ్చేది.

మా ఇంట్లో ఒక అగ్ని హోమం ఉంది. అందులో ఎల్లప్పుడూ అగ్ని రాజుకుంటూనే ఉంటుంది. నాకు మొదటి నుండి మత సంబంధమైన కార్యాలంటే ఎంతో ఉత్సాహంగా ఉండేది. మేము అగ్నిని పూజిస్తాము. రేయింబవళ్ళు ఆరనీయకుండా అగ్ని గుండం మండించటమే మా ఆరాధన! అందువలన నేను నిత్యం ఈ ఆరాధనలోనే నిమగ్నమయి ఉంటాను. మతపరమైన కార్యక్రమాలు నిర్వర్తించటానికి మా ఇంటికి "ఖుతున్" అనే మత గురువులు వస్తుంటారు. అహర్నిశలు అగ్నిగుండం ఆరకుండా మండించటం వారి పని! నేను కూడా అగ్ని పూజలో నిమగ్నమై ఇంటి పూజారినయ్యాను. నాకు ఇష్టమైన దినచర్య ఒక్కటే! నిప్పును ఎగద్రోయటం, అది ఆరకుండా చూడటం. నాకు తెలియకుండానే రోజులు గడుస్తున్నాయి. చీకూ, చింతా లేకుండా నేను బాల్యాన్ని గడుపుతున్నాను. ఓ రోజు మా ఇంటి మరమ్మతుకు నాన్నగారు కూలీలను రప్పించారు.

"మాబా! ఇవాళ నాకు ఇంటి మరమ్మతు పని వుంది, నీవు పొలం వెళ్ళు" అంటూ అక్కడ చేయవలసిన, చూడవలసిన పనులన్నీ వివరంగా చెప్పి పంపించారు. అయితే గట్టి హెచ్చరికతో, "నాయనా! సూర్యాస్తమయానికి ముందే ఇల్లు చేరాలి, రాకుంటే నేను ఇక్కడ కంగారు పడుతుంటాను."

నాకు అంతులేని ఉత్సాహం కలిగింది. మహదానందంగా పొలం దారి పట్టాను. దారి పొడవునా నలువైపులా పరికించుకుంటూ ప్రతిదాన్నీ పరిశీలనగా గమనిస్తూ వెళ్తున్నాను. ఎందుకంటే ఇలా బయటకు వచ్చే అవకాశం ఎప్పటికోగాని రాదు! త్రోవలో అందమయిన ఓ పెద్ద కట్టడంపై నా దృష్టి పడింది. అది క్రైస్తవుల ఆరాధనాలయం! దానిని ఇంకొంచెం సమీపించాను. లోపలి నుండి సంగీతం వినిపించింది. చాలామంది కలసి ఎంతో ఉత్సాహంతో లయబద్ధంగా పాడుతున్నారు. పాటలో ఏదో పరమార్థం! ఎవరికో స్తోత్రం! వీనులవిందైన సంగీతం! మధురానుభూతి కలిగింది. అప్రయత్నంగా నా మనసు నాకర్షించింది. దైవారాధనలో నాకు ఉత్సాహమున్నందువల్ల నేను అక్కడనే ఆగిపోయాను. నెమ్మదిగా లోపలికి వెళ్ళాను.

అక్కడ అందమైన కొందరు యువతీ యువకులు బారులు తీరి నిల్చొని పాడుతున్నారు. వారు దేవుడి స్తుతిగానం చేస్తున్నారు. నాకు వారి ఆరాధనా విధానం చాలా నచ్చింది. వారిని తదేకంగా చూస్తూ వారి పాటలు మైమరచి వింటూ నా అసలు పని మరచిపోయాను. సాయంత్రం అయినా నాకు తెలియలేదు. అప్రయత్నంగా వారి మతం నా మనస్సు నాకర్షించింది. "దేవుని తోడు! వీరి మతం మన మతం కంటే చాలామంచిది" అంటూ నా అంతరాత్మ ఘోషించింది.

మనసులోని మాట వాళ్ళతో చెప్పేశాను చొరవగా; "మీ మతం నాకు సమ్మతంగా ఉంది. ముఖ్యంగా మీ ఆరాధనా తీరు నాకు చాలా నచ్చింది. ఇంతకీ మీ మత కేంద్రం ఎక్కడ?" అడిగాన్నేను.

"సిరియా" అని చెప్పారు క్రైస్తవులు.

వారు నా మనోభిలాషను తెలుసుకుని సంతోషించారు. వారితో ఏదేదో కొంతసేపు మాట్లాడాను. ఆ తరువాత ఇంటి ముఖం పట్టాను.

ప్రొద్దు గ్రుంకింది. చీకట్లు మెల్లమెల్లగా కప్పేస్తున్నాయి. నాన్నగారు కంగారుగా

కాలుగాలిన పిల్లిలా అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు. నన్ను వెతికేందుకు నాలుగువైపులా మనుషుల్ని పంపించారు. భయం భయంగా నేను ఇంట్లో అడుగుపెట్టగానే నాన్నగారు నన్ను కౌగిలించుకుని గుండెలకు హత్తుకున్నారు. నాన్నగారి నేత్రాల నుండి ఒక్కసారిగా ఆనందభాష్పాలు కురువసాగాయి. నన్ను పదే పదే గుండెలకు హత్తుకుంటూ వీపు నిమురుతున్నారు.

"నాయనా ఇంతసేపు ఎక్కడున్నావు బాబు? నేను ముందే చెప్పి పంపించానుగద నాయనా! చీకటి పడే వరకు వుండకు, త్వరగా వచ్చేయమని. ఎంత జాగు ... ఎంత జాగు చేశావు! నేను కంగారు పడతానని మరచావా? ఎంత బాధపడ్డాను? నీ దిగులుతో ఇంటి పని కూడా సరిగా చేయించలేకపోయాను. వేదన భరించ శక్యం కాలేదు!" అన్నారు నాన్నగారు. వారి కళ్ళ నుండి అశ్రువులు వర్షిస్తూనే ఉన్నాయి.

ఇవాళ నా మనస్సు పరధ్యానంగా ఉంది. అవే ఆలోచనలు! అవ్యక్త కరుణామయుని ఆరాధన! సుమధుర గీతాలాపన, నా చెవుల్లో ఇంకా ప్రతిధ్వనిస్తూనే ఉంది. రుజుమార్గాన్వేషణ వల్ల కలిగిన ఆనందంలో నా అంతరంగాన చెలరేగిన తరంగాల ఘోష నాన్నగారికి వినిపించాను.

నాన్నగారు! నేను పొలం వెళ్ళేటప్పుడు ఒక అందమైన భవనం కనిపించింది. అక్కడ ఏదో చదువుతున్న ధ్వని వినిపించింది. నేను ఆగిపోయాను. ఆ ధ్వనిలో ఏదో తెలియని మధురమైన ఆకర్షణ ఉంది. నేను ఉత్సాహంగా లోపలికి వెళ్ళాను. క్రైస్తవులు కొందరు నిలబడి ప్రార్థన చేస్తున్నారు. వారెంతో భక్తి ప్రపత్తులతో దేవుని ఆరాధనలో నిమగ్నమై ఉన్నారు. అప్రయత్నంగా ఆ దృశ్యం నా మనసును ఆకర్షించింది. ఆ సంతోషంలో పొలం పనులు కూడా మరిచిపోయాన్నేను. సూర్యాస్తమయం వరకూ నేను వారి ఆరాధన తిలకిస్తూనే ఉన్నాను. నాన్నగారు! ఆ సుందరాంగులు అవ్యాజానురాగాలతో దైవాన్ని మధురంగా స్తోత్రగానం చేస్తుంటే నా హృదయం ఉప్పొంగిపోయింది. ఇదే నిజధర్మమని దైవారాధనకు ఇదే సరైన పద్ధతి అని నా అంతరాత్మ ఘోషించింది.

"కాదు ... కాదు మాబా! మన తాత ముత్తాతల నుండి వస్తున్న మనదే సత్యధర్మం. వాళ్ళ మతంలో ఏముంది? దానికంటే మన మతమే గొప్పది. మన పద్ధతిలోనే దేవుని ఆరాధించు."

"కాదు నాన్నగారు! ఈ క్రైస్తవుల మతం చాలా మంచిది. ఒకే దేవుని ఆరాధన! ఆ ఆరాధన మార్గమే అసలయినది. దేవుని ఆరాధనలో మరొకరికి సాటి కల్పించటం ఎంతయినా తప్పే.

ఇప్పుడ్నుంచి నేను అగ్ని ఆరాధన చేయను. నిరాకారుడైన ఆ దేవుడిని మాత్రమే పూజిస్తాను. దేవుని తోడు! క్రైస్తవ మతమే మన మతం కంటే ఎంతో మేలయినది" ఉద్వేగంతో నా నిర్ణయం తెలిపాన్నేను.

నా మాటలు విని నాన్నగారు దిగ్భ్రాంతి చెందారు. క్రైస్తవ మతం పుచ్చుకొని మత భ్రష్టుడవుతాడేమోనని దిగులుపడ్డారు. మా పూర్వీకుల మతం విడనాడితే నాన్నగారు సహిస్తారా?

నాపై పర్యవేక్షణ కఠినతరం చేశారు. మళ్ళీ చర్చికు వెళ్ళకుండా నా కాళ్లకు ఇనుప సంకెళ్ళు వేయించారు. నాలో పట్టుదల ఇంకా ఎక్కువయింది. గృహ నిర్బంధంలో సహనాన్ని పాటించాను. నా లక్ష్యం ఒక్కటే! క్రైస్తవులను నేనెలా కలవాలి? మెల్లిగా ఒక నౌకరుని మచ్చిక చేసుకున్నాను. సిరియా నుండి వర్తక బిడారు వస్తే తప్పనిసరిగా నాకు తెలియజేయవలసినదిగా నౌకరు ద్వారా రహస్యంగా క్రైస్తవ మిత్రులకు కబురు చేశాను. కొద్ది రోజుల్లోనే క్రైస్తవ బిడారు ఒకటి అస్ఫహాన్‌కు చేరింది. రహస్యంగా సమాచారం అందింది. బిడారు తిరిగి సిరియాకు బయలుదేరే ముందు తెలుపమని కబురు చేశాను. వచ్చిన పని ముగించుకొని బిడారు బయలుదేరే ముందు నాకు వార్త అందించారు క్రైస్తవులు. నేనెలా బయటపడాలో ముందుగానే ఉపాయం ఆలోచించే ఉంచాను.

నా పథకం ప్రకారం రహస్యంగా కాళ్ళకున్న సంకెళ్ళు నరకించుకొని కట్టుబట్టలతో ఇంట్లోంచి బయటపడ్డాను. ఎవరి కంటబడకుండా దాగుతూ, నక్కుతూ వెళ్ళి ఆ బిడారంలో కలిసిపోయాను. ఇప్పుడు బిడారు సిరియా వైపునకు పయనమయింది. సత్యాన్వేషణలో ఇది నా ప్రథమ ప్రయాణం! నా ప్రియమైన జన్మభూమిని, మా పల్లెను, మా ఇంటిని వీడిపోతున్నాను. తల్లిదండ్రుల ప్రేమానురాగ మాధుర్యానికి దూరమవుతున్నాను. విలాసవంతమైన జీవితాన్ని త్యాగం చేశాను. అయినా నేనే మాత్రం విచారించటం లేదు. ధార్మిక సంతుష్టితో నా హృదయం పొంగింది. అనిర్వచనీయమైన ఆనందం నన్ను ఆవహించింది.

మజిలీలకు మజిలీలు దాటుకుంటూ కొద్ది రోజుల్లోనే సిరియా పొలిమేరల్లో ప్రవేశించాము. అక్కడకు చేరుతూనే వాకబు చేశాను – ఇక్కడి 'మత పీఠాధిపతి' ఎవరని! ఆ మత పీఠాధిపతి ఫలానా చర్చిలోని ఫలానా ఫాదర్ అని తెలుసుకున్నాను.

నేను నిస్సంకోచంగా శరవేగంతో పరుగులాంటి నడకన చర్చి వైపునకు దారి తీశాను. ఆ ఫాదర్ కొలువులో ఎప్పుడు వాలుదామా అని ఆత్రంగా ఉంది. చివరకు ఆ చర్చి కనిపించగానే అమితోత్సాహంతో లోపలకు జొరబడ్డాను. అక్కడ మృదువైన ఆసనం మీద ఓ పెద్ద మనిషి ఆసీనుడయి ఉన్నాడు. ఆయన చుట్టూ కొందరు గుమిగూడి కూర్చున్నారు.

నేను కూడా అభివాదం చేసి కూర్చున్నాను. ఎలాంటి అదురూ బెదురూ లేకుండా "అయ్యా! నేను బహుదూరాన్నుండి, అస్ఫహాన్ ప్రాంతం నుండి వచ్చాను. మీ మతం నాకెంతో నచ్చింది. కేవలం దీనికోసమే వచ్చాను. తమ సేవలో మత ధర్మాలు నేర్చుకుంటాను. అద్వితీయ దైవోపాసనంతో నా ఆత్మకు, అంతరాత్మకు ప్రశాంతత చేకూర్చండి" అని ప్రాధేయపడ్డాను. ఫాదర్ అమితానందభరితుడై నన్ను తనతోపాటే ఉండమనీ అనుమతించారు. ఇక నేను ప్రశాంతంగా చర్చిలో ఉంటున్నాను. అహర్నిశలు దైవారాధనలో, ఫాదర్ సేవలో నిమగ్నమయ్యాను. కానీ ఫాదర్ పెద్ద వంచకుడు! మోసగాడు!! ఐహిక వ్యామోహితుడని కొద్దిరోజుల్లోనే గ్రహించాను. అతడు మాత్రం పెద్ద ధనాపేక్షాపరుడు. "నిరుపేదలను దీనులను గమనించండి. దిక్కులేని వారిని అగత్యపరులను ఆదుకోండి" అని తెగ నీతులు చెబుతాడు. అతని ఉపన్యాసాలకు స్పందించి ప్రజలు, డబ్బూ దస్కం తెచ్చి ఇచ్చేవారు – అగత్యపరులకివ్వమని! కానీ ఈ టక్కరి – ఫాదర్ పేదసాదలకివ్వక ధనం కూడబెట్టేవాడు. ఈ విధంగా కూడబెట్టి కూడబెట్టి ఏడు పాత్రలలో బంగారు, వెండి నాణాలు నింపాడు. ఆ మోసగాని పేరాశకు నేనెంతగానో చింతించాను. వాడంటే నాకు అసహ్యం కలిగింది. అయితే ఈ దుష్టుడి కారణంగా నేను దైవారాధనలో, విశ్వాసంలో ఎలాంటి లోపం రానివ్వలేదు. నా ప్రియాతి ప్రియమైన దేవుడిని కొలిచేందుకు సర్వసుఖాలను త్యాగం చేసి క్రైస్తవాన్ని స్వీకరించానే గాని, ఈ ఫాదర్ కొరకు కాదు గదా! వాడిలో దుర్నీతి, దుష్కర్మ, ధన వ్యామోహం ఉంటే .... వాడి ఖర్మ వాడు అనుభవించి తీరుతాడు. నాకయితే దైవ ప్రసన్నతే చాలు! దైవాజ్ఞ బద్ధుడనయి జీవించి ఆయన సాన్నిధ్యం పొందితే చాలు!!

కాలం గడుస్తూనే ఉంది. ఆ మోసగాడిపై అయిష్టత పెరుగుతూనే ఉంది. చివరకు కాలం మూడి చనిపోయాడు. ఫాదర్ మరణ వార్త విని సిరియా శోక సముద్రంలో మునిగింది. నగరవాసులు, దూరప్రాంతవాసులు సంతాపం తెలుపటానికి, ఫాదర్ అంత్యక్రియలలో పాల్గొనటానికి చర్చి వద్దకు చేరుకుంటున్నారు. ప్రతి ఒక్కరూ మతాధిపతి మరణానికి చింతిస్తున్నారు. విచారంతో వారి వదనాలు వాడిపోయాయి. కానీ, నా పరిస్థితి ఇందుకు భిన్నంగా ఉంది. ఎందుకు దు:ఖం? ఎందుకు విచారం?

ఈ తతంగమంతా చూస్తున్న నేను కోపావేశాలను ఆపుకోలేకపోయాను. వారి ఏడ్పులు, పెడబొబ్బలు శుద్ధ వ్యర్థమని ఈ అమాయక ప్రజలకు ఎలాగయినా చెప్పాలనిపించింది. ఫాదర్ అసలు రంగు బయటపెడదామని చివరకు నిర్ణయించు కున్నాను.

"మీరు ఎవరి అంత్యక్రియలకు వచ్చారు? అంత్యక్రియల ప్రార్థనకు వీడా అర్హుడు? పచ్చి మోసగాడు! నయవంచకుడు! నమ్మక ద్రోహి. మతం ముసుగులోని షైతాన్. ధర్మం పేరిట ఐహిక కాంక్షలతో ధనం ప్రోగు చేశాడు. దానధర్మాలు చేయండని ప్రజల్ని ఉసిగొల్పాడు. నిరుపేదల, అగత్యపరుల హక్కులు నెరవేర్చమన్నాడు. ప్రజలు దానధర్మాల పేరిట ఇతని వద్ద ధనం జమచేసినపుడు పేద సోదరులకు పంచే బదులు తన పాత్రలు నింపుకున్నాడు."

ఆగ్రహావేశాలను నేను అదుపు చేసుకోలేకపోయాను. ఇంకా ఏమేమి చెప్పానో నాకే తెలియదు. నా మాటలు విని జనం నిశ్చేష్టులయ్యారు. రాతి విగ్రహాల్లా నిలబడిపోయారు. ఫాదర్‌ను గ్రుడ్డిగా నమ్మిన కొందరు నాపై ఆగ్రహం చూపారు. అయితే నేను చాలా కాలంగా ఫాదర్ సేవలో చర్చిలో వుంటున్నందున నన్ను చిన్న మతాధిపతిగా పరిగణించేవారు. అందువలన నన్ను గట్టిగా ఎదుర్కొనేందుకు ఎవరికీ ధైర్యం చాలలేదు.

"ఇదంతా మీకెలా తెలుసు? మీరెలా చెప్పగలుగుతున్నారు? దీన్ని మీరు రుజువు చేయగలరా?" ప్రజలు నిలదీశారు నన్ను.

"నాతో లోపలికి రండి, ఈ పేరాశ ఫాదర్ దాచిన ధనం మీకు చూపిస్తాను. ఒకటీ రెండు కాదు! ఏడు! ఏడు పాత్రల నిండా వెండీ, బంగారం దాచాడు" అన్నాన్నేను

తెగింపుగా! ప్రజలు కుతూహలంగా నాతో లోపలికి జొరబడ్డారు. లోపలికెళ్ళి చూస్తే ఏముంది? నిజంగా ఏడు పెద్ద పెద్ద పాత్రలు వెండి, బంగారం. వాటిని చూసి ప్రజలు కోపం పట్టలేక పటపట పళ్ళు కొరికా.

"మేము ఈ నీచుడి, మోసగాడి అంత్యక్రియా ప్రార్థన ఎంత మాత్రమూ చేయబోము. వీడయితే చచ్చాడు. అయినా సరే! వీడి శవంపై కసిదీరా రాళ్ళ వర్షం కురిపిద్దాము. ఇకనయినా ప్రజలు మతాధిపతులను గ్రుడ్డిగా నమ్మి మోసపోరు. వాళ్ళపై ఒక కన్నేసి ఉంచుతారు. ఇలాంటి మతాధిపతులకు కూడా గుణపాఠం కలుగుతుంది. లేకుంటే ఇలాంటి వెధవలు చర్చీల్లో దూరి ప్రజల సొమ్మును గతుకుతుంటే మతాధిపత్యం ఒక వృత్తిగా మారి జాతిని సర్వనాశనం చేస్తుంది" ఆగ్రహం, అసహ్యం వెళ్ళగక్కారు ప్రజలు.

ఫాదర్ శవాన్ని బహిరంగ ప్రదేశంలో వ్రేలాడదీశారు ప్రజలు. రాళ్ళు రువ్వి, తిట్టి, ఘోరంగా అవమానపరచి తమ కక్ష తీర్చుకున్నారు.

ఇప్పుడు చర్చీలో ఓ కొత్త ఫాదర్‌ని నియమించారు. అమిత గౌరవ మర్యాదలతో ఆహ్వానించారు. కొత్త ఫాదర్ సద్గుణ సంపన్నులు, పుణ్యాత్ములు! ఆధ్యాత్మిక చింతన గలవారు, అహర్నిశలు ఏక దైవోపాసనలో నిమగ్నులయ్యేవారు. ప్రతి పనీ నిష్ఠతో చేసేవారు. ఇంతవరకు నేను ఇలాంటి సజ్జనుని, సచ్చరిత్రుని చూడలేదు. వారి సచ్ఛీలత నా జీవితాన్ని ప్రభావితం చేసింది. నా హృదయంలో వారి యెడల గౌరవానురాగాలు పెరిగాయి. పొద్దస్తమానమూ వారి వెన్నంటే ఉండేవాడిని. మనస్ఫూర్తిగా వారిని సేవించుకుంటూ ధార్మిక జ్ఞానార్జన చేశాను.

కానీ ఈ అదృష్టం, అవకాశం ఎన్నాళ్ళో వుండలేదు. ఆయన గారి కాలం కూడా బోతూ ఉంది. వారి జీవితం ఇంకొద్ది గంటల్లోనే ముగిసేలా ఉంది. నేను వినయంగా వారి ప్రక్కన కూర్చున్నాను. "మహాశయా! తమ సహచర్యంలో కాలం సంతోషంగా గడిచింది. జీవితం అశాశ్వతం. పుట్టిన ప్రతి ప్రాణి గిట్టక తప్పదు. అయితే ఒకరు ముందు, మరొకరు వెనుక. తమరు నా ధార్మిక గురువులయి వున్నందున తమరంటే నాకెంతో అభిమానం. తమరి తదనంతరం నేను ఎక్కడికి వెళ్ళాలో, ఎవరిచెంత విద్యాభ్యాసం చేయాలో ఉపదేశించండి మహానుభావా!" అని దీనంగా విన్నవించు కున్నాను.

ఫాదర్ గొంతు బొంగురుపోయింది. నా యెద ప్రేమాతిశయంతో ద్రవించి, కనులు చెమర్చాయి. నిట్టూర్చుతూ, గద్గద స్వరాన "నాయనా! నేనేమని నిన్ను ఉపదేశించనూ? ఎవరిని ఆశ్రయించమని సలహా యివ్వను? లోకం పోకడ చూస్తుంటే తాము నమ్మిన ధర్మాన్ని స్థిరంగా నిష్ఠగా ఆచరించేవారెవ్వరూ నాకు కనిపించడం లేదు. సజ్జనులు, ధర్మాత్ములు, ఇంకెక్కడున్నారు బాబు! ప్రజలు ధర్మంలో తమ యిష్టం వచ్చినట్లు మార్పులు, చేర్పులు చేస్తున్నారు. హజ్రత్ ఈసా (అ) (ఏసుక్రీస్తు) ప్రబోధించిన సత్యధర్మానికి దూరమయ్యారు. ఆ! ఇప్పుడు గుర్తుకొచ్చింది విను! "మోసిల్ నగరంలో ఒక మహనీయుడున్నాడు. మనం అనుసరిస్తున్న ధర్మాన్నే అతను సక్రమంగా ఆచరిస్తున్నాడు. నా తరువాత నీవు ఆయన్ని ఆశ్రయించి ఏకాగ్రతగా దైవారాధనలో నిమగ్నుడవయి ఆధ్యాత్మిక సాధన చేయి" అని ఉపదేశించాడు ఫాదర్!

గురువుగారు పరలోకగతులైన అనంతరం వారి అంత్యక్రియలు జరిపి అవసరమైన దినాచారాలు ముగించి వారి హితబోధ ప్రకారం "మోసిల్"కు పయనమయ్యాను. కొన్ని రోజుల ప్రయాణానంతరం "మోసిల్" నగరం చేరుకున్నాను. సిరియా మతాధిపతి తెలిపిన ఆ మహాశయుని చిరునామా తెలుసుకున్నాను. కొద్ది అన్వేషణ, ప్రయాసలతో వారి సమక్షాన హాజరయ్యాను. అత్యంత వినయంగా నా గాథను విన్నవించి ఫలానా మతాచార్యులు మీ సేవలో గడపవలసినదిగా ఉపదేశించినందువల్ల ఇక్కడకు వచ్చానంటూ మనవి చేసుకున్నాను. నా గాథను విన్న మోసిల్ ఫాదర్‌గారి నయనాలు అశ్రు పూరితాలయ్యాయి. ఈ మహనీయుడు నన్నెంతో వాత్సల్యంతో తన సంరక్షణలో శిక్షణ ఇచ్చారు. ఆయన సహచర్యంలో నేను ప్రశాంతంగా కాలం గడుపుతూ ఈ మహదవకాశాన్ని ఉపయోగించుకున్నాను. ఏకాగ్రతతో దైవారాధనలో నిమగ్నమయ్యాను.

సిరియా ఫాదర్ వలె ఇతను కూడా ఉత్తమ గుణవంతుడు, దైవభీతి గలవాడు, నిస్వార్థపరుడు. ఈయన సేవలో నాకు మనశ్శాంతి లభించింది. కాని దైవ నిర్ణయం వేరుగా ఉంది. ఆయన కాలం తీరింది. ఆరోగ్యం బాగా క్షీణించింది. కన్నీళ్ళ పర్యంతమై బరువుగా అడుగులు వేస్తూ వారిని సమీపించాను. "అయ్యా! తమకు తెలియంది కాదు! నేను క్షణం కనిపించకుంటే తల్లడిల్లిపోయే మా నాన్నను, ప్రేమమూర్తి అయిన మా అమ్మను, వడ్డించిన విస్తరిలాంటి జీవితాన్ని వదులకొని వచ్చిన విషయం మీకు తెలిసిందే. మీలాంటి మహనీయుల సేవలో గడిపి ముక్తి పొందాలన్నదే నా ఆకాంక్ష.

నా ప్రియమైన దేవుడిని మనసారా కొలుద్దామని ఇక్కడికి వచ్చాను. సిరియా ఫాదర్ తమ వద్దకు పంపించారు. ఇప్పుడు నన్ను ఎక్కడకు వెళ్ళమంటారో ఉపదేశించండి" అంటూ దీనంగా అభ్యర్థించాన్నేను.

మోసిల్ ఫాదర్ దీర్ఘంగా నిట్టూర్చి మౌనంగా ఉండిపోయారు. మా ఇద్దరి మధ్య కాస్సేపు నిశ్శబ్దం ఆవరించింది. నా జీవితానికి రానున్న మలుపునకై నిరీక్షణ! నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ గంభీరంగా, "నాయనా! నిన్ను ఎవరిని ఆశ్రయించమని చెప్పను? అన్ని దిక్కులా మూర్ఖత్వం, ప్రాపంచిక వ్యామోహం లోకాన్ని కమ్ముకుంది. హజ్రత్ ఈసా (అ) (ఏసుక్రీస్తు) ప్రబోధించిన సత్యధర్మాన్ని మనస్ఫూర్తిగా, నిష్ఠగా ఆచరించేవారు ఈ లోకంలో ఉన్నట్లు నాకు తెలీదు. అయితే "నసీబిన్" పేరు వినే వుంటావు. నసీబిన్‌లో ఈ కోవకు చెందిన ఒకే ఒక మహాశయుడున్నాడు. వాస్తవంగా అతను దైవజ్ఞుడు, ధర్మాత్ముడునూ! వీలయితే నా తరువాత నీవు అక్కడకు వెళ్ళు! అతని పర్యవేక్షణలో ఆ పరాత్పరుని పూజింపు" అన్నారు మోసిల్ ఫాదర్. నా సుదీర్ఘ ప్రయాణంలో ఈ మజిలీ కూడా కనుమరుగయింది.

చివరకు వారు కూడా పరమపదించారు. వారి అంత్యక్రియలు, దినవార తతంగాలు ముగిశాక నసీబిన్ దారిపట్టాను. కొద్ది రోజుల్లోనే నసీబిన్ పొలిమేరల్లో అడుగిడాను. నసీబిన్‌లో ఆ మహాశయుని గూర్చి తెలుసుకున్నాను. కొంచెం ప్రయాసపడినా చివరకు ఆయన గారిని కలిశాను. పిదప కథ మామూలే! నా గాథనంతా ఓపిగ్గా, వినయంగా వినిపించాను. ఆయనగారు కూడా సద్గుణ సంపన్నుడు, దైవాజ్ఞా పాలకుడు. ఈయన శిష్యరికంలో కాలం సుఖంగా గడుస్తోంది.

కొద్ది కాలంలోనే ఈయన్ను కూడ మృత్యువు ఆహ్వానించింది. రోజు రోజుకు ఆరోగ్యం క్షీణించసాగింది. పరిస్థితి నిరాశాజనకంగా మారింది. నేను వారిని సమీపించి "అయ్యా! నేను బహుదూరపు బాటసారిని. ఎన్నో మజిలీలు దాటి మీ దరిని చేరాను. ఎంతో ప్రశాంతంగా తమ శిక్షణలో ధార్మిక విద్యనభ్యసించాను సంతృప్తిగా! కానీ విధి నిర్ణయం తప్పించేదెవరు? నా యెడల దైవ నిర్ణయం విచిత్రంగా ఉంది!

సిరియా మహాశయుడు కొన్నాళ్ళకే పరమపదించారు. ఆయన ఆజ్ఞానుసారం "మోసిల్" ఫాదర్‌ని ఆశ్రయించాను. కొద్దికాలంలోనే ఆ పుణ్యాత్ముడు కూడా దివంగతుడయ్యాడు. ఆయన పోతూ, పోతూ మీ వద్దకు పంపించారు. ఇప్పుడు మీరు

సయితం లోకం విడిచిపోతున్నారు. గురువర్యా! చెప్పండి, నాకేది దిక్కు? నేను ఏ దారి పట్టను? ఎటుపోను?" ఆపై మాట పెగలలేదు. అప్రయత్నంగా కళ్ళు ధారాపాతంగా కురిశాయి. గురువుగారి హృదయం ద్రవించి దగ్గరికి పిలిచారు. గాద్గదిక స్వరంతో, "నాయనా! ప్రపంచంలో ఇప్పుడు ధర్మం ఎక్కడుంది? స్వచ్ఛమైన క్రైస్తవ మతాన్ని పాటించే ఒక్క వ్యక్తి కూడా నాకు గోచరించటం లేదు. ఆ.. ఆ.. ఇక్కడి నుండి కొంత దూరాన "అమూరియా" అనే పట్టణం ఉంది. ఆ పేరు నీవు వినే వుంటావు. అక్కడ ఒక దైవ దాసుడున్నాడు. నిజానికి అతను మన మతాన్ని నిష్ఠగా, స్థిరంగా ఆచరిస్తున్నాడు. అతడు మహా ధర్మాత్ముడు. సత్యధర్మం పాటిస్తున్నాడు. అతని జీవితం పరమ పవిత్రం. నా తరువాత నీవు అతని సహచర్యంలో, దైవభక్తి, ఆధ్యాత్మిక చింతనలతో, ముక్తి మార్గాన్వేషణలో మనశ్శాంతి పొందవచ్చు" అని దారి చూపారు.

మృత్యువు నసీబిన్ ఫాదర్ గారిని కూడా తన కౌగిట్లోకి తీసుకుంది. నేనొక మంచి సంరక్షకుని, సద్గురువుని కోల్పోయాను. ఈయనగారి అంత్యక్రియలు తదితర ఆచారాలు యధావిధిగా జరిగాయి. సత్యాన్వేషణ బాటన మజిలీలు ఎన్నో? నా గమ్యం ఎక్కడో? ఓ మజిలీ వెనక్కు ... మరో మజిలీ ముందుకు!

ఇక ఏ మాత్రం ఆలస్యం చేయలేదు. అమూరియా వెళ్ళేందుకు అవసరమయిన సరుకు సిద్ధపరుచుకొని మళ్ళీ పయనమయ్యాను. దైవనామస్మరణ గతస్మృతులతో సాగిన ఆ బాట కొద్ది రోజుల్లోనే నన్ను అమూరియా చేర్చింది. సాధ్యమైనంత శీఘ్రంగా "అమూరియా" లోని ఆ దైవదాసుని దర్శించుకోవాలని మనసు ఉవ్విళ్ళూరుతుంది. ఆయనగారి చిరునామా విచారిస్తూ వెళ్ళి ఒక పెద్ద చర్చీ చేరుకున్నాను. నా శ్రమ ఫలించింది.

అక్కడ ఆయనగారి దర్శనభాగ్యం లభించింది. అభివాదం చేసి వినమ్రుడనై వారి సన్నిధిలో చేరాను. వారు అమిత వాత్సల్యంతో, "నాయనా! నీవెవరవు? ఎక్కడి నుండి వచ్చావు?" అని అడిగారు. నా గాథ, నా పయనం దీనంగా వినిపించాను. ఆయన నా యెడల ఎంతో ప్రేమాదరణలు చూపారు. ఆయనగారి దైవారాధన, ప్రార్థన శైలి నన్నెంతో ఆకర్షించింది. నా మనస్సుకు ఏకాగ్రత సిద్ధించింది.

రాత్రులు సయితం ఆయనతో పాటు దైవారాధనలో గడిపాను. పగలు కూడా సృష్టికర్త ధ్యానంచేసే వారితో గూడి అత్యధిక పుణ్యప్రాప్తి కోసం కృషి చేశాను. దీనితో

పాటు కూలీ నాలీ చేసుకునే వాడిని. ఫలితంగా నా దగ్గర కొంత పైకం సమకూరింది. తద్వారా కొన్ని ఆవులు, మేకలు మంద కూడా పోగయింది. ఒడిదుడుకులు లేకుండా కాలం సుఖశాంతులతో గడిచిపోతోంది.

కానీ విధి విలాసం! ఆ వృద్ధ ఫాదర్ గారిక్కూడూ దేవుని పిలుపు వచ్చింది. మళ్ళీ నేను అగమ్యగోచరావస్థలో పడ్డాను. అనూహ్యంగా దిగులు మొదలయ్యింది. నా ఆవేదనను ఆయనతో విన్పించాను. "గురువర్యా! తమకు తెలియంది కాదు. నేను ఎన్నెన్ని ఎదురు దెబ్బలు తిన్నానో - ఎన్నెన్ని ఇబ్బందులు అనుభవించానో! ఎక్కడెక్కడ తిరగానో! అదృష్టవశాత్తు మీ సాన్నిధ్యం లభించింది. ఇప్పుడు తమరు సయితం నన్ను విడిచి వెళుతున్నారు. ఆజ్ఞాపించండి గురువర్యా! నేనెక్కడకు వెళ్ళను?" భోరున విలపించాను. నా స్వరంలో అభ్యర్థన, ఆకాంక్షలతో పాటు నిరాశ కూడా మిళితమైంది. వృద్ధ ఫాదర్‌గారు శ్రద్ధగా ఆలకించారు నా విలాపాన్ని!

వారిలో జాలి, ప్రేమ, బాధ ఏకమై గొంతునుండి పెదాలపై జాలువారింది. "బాబూ! దేవుని తోడు! ఇప్పుడు ప్రపంచంలో ఏసుక్రీస్తు బోధించిన మతాన్ని అనుసరించేవాడు ఒక్కడూ లేడు! నీవే చెప్పు! నిన్నెవరి వద్దకు పంపనూ? అష్టదిక్కులా అజ్ఞానాంధకారం అలుముకొని ఉంది. ప్రజలు సత్యధర్మాన్ని విడనాడారు. తమ మనోకాంక్షలనే పూజిస్తున్నారు. అయితే విను, ఒక శుభవార్త! నేనయితే అప్పటికి బ్రతికి ఉండనేమో! దైవేచ్ఛ అయితే నీకు మంచి భవిష్యత్తు ప్రాప్తమవుతుంది. సృష్టికర్త తన చిట్టచివరి సందేశహరుని ప్రభవింపజేసే కాలం దగ్గరపడింది. ఆయన అరబ్బు దేశాన జన్మిస్తారు. ప్రవక్త ఇబ్రాహీం (అ) విధానాన్ని పాటిస్తారు. కొంతకాలం మాతృభూమిలో ప్రచారం చేస్తారు. దైవానికి సహవర్తునిగా యెంచడాన్ని, బహుదైవారాధన మొదలయిన రుగ్మతల్ని దూరం చేసి, ప్రజల జీవితాలను పరమ పావనం చేస్తారు. కాని దురదృష్టం! ఆ నగరంలోని దుష్టులు ఆయన్ని పలు విధాల బాధిస్తారు. చిట్టచివరకు ఆయన అక్కడి నుండి వలస వెళ్ళేలా చేస్తారు. ఆయన మరొక నగరానికి వలస వెళ్తారు. ఆ నగరం వాస్తవంగా రెండు నల్లని కొండల మధ్య ఉంటుంది. నగరం చుట్టూ ఖర్జూరపు తోటలు వుంటాయి. ఆ మహనీయుని స్పష్టమైన కొన్ని గుర్తులు తెలియజేస్తున్నాను విను! దేవుడు నీకు వారి దర్శన భాగ్యం కలుగజేయుగాక! ఏదో గుర్తు చేసుకుంటూ ఆగారు. ఆయన కళ్ళ నుండి అశ్రువులు ధారాపాతంగా కారుతున్నాయి. అయినా

కొంత సంతోషంతో - "నాయనా! ఆ అరబ్బు ప్రవక్త మూడు చిహ్నాలు నీవు అవశ్యం గుర్తుంచుకో!

ఒకటి - ఆయన దానం స్వీకరించరు.

రెండు - కానుకలయితే సంతోషంగా స్వీకరిస్తారు.

మూడు - ఆయన వీపున, రెండు భుజాల మధ్యన దైవ దౌత్యపు ముద్ర వుంటుంది! (శ్వాస పీల్చుకోవడానికి ఆయన ఆగారు.)

"మిత్రుడా, నీ అదృష్టం అనుకూలిస్తే నీవు తప్పనిసరిగా ఆయన సన్నిధికి చేరు" వృద్ధ మార్గదర్శి కళ్ళు ఆనందాతిశయంతో తేజోవంతమయ్యాయి. ప్రేమానురాగాలతో నేను ఆయన ముఖవర్చస్సును తదేకంగా చూస్తూ ఉండగా ఆయన ఆత్మ అనంత వాయువుల్లో కలిసిపోయింది. నా కన్నీళ్ళు కట్టలు తెంచుకున్నాయి.

వారి చివరి పలుకులు స్పష్టంగా నా చెవుల్లో మార్మోగుతున్నాయి. "మిత్రమా! నీ అదృష్టం అనుకూలిస్తే తప్పనిసరిగా ఆయన సన్నిధికి చేరు!" భవిష్యత్తు చిహ్నాలు ఎరిగిన నా ఆనందానికి అవధులు లేవు. ఫాదర్ చెప్పిన అరబ్బు ప్రవక్త పవిత్ర చిహ్నాలు నా మనోఫలకంపై పదిలపర్చుకున్నాను. అరబ్బు దేశానికి వెళ్ళే ఏదైనా బిడారం కొరకు నిరీక్షిస్తూ ఉండిపోయాను - వారితో కలిసి అరబ్బు చేరేందుకు!

కొన్ని రోజులు గడిచాక ఒక బిడారం అరేబియాకు వెడుతోందని తెలిసింది. ఆ బిడారం వారిని కలిశాను. నా కోరికను తెలిపాను. నన్ను వారి వెంట తీసుకువెడితే నా వద్ద ఉన్న మేకల మందను, ఆవుల్ని వారికి సమర్పించుకుంటానని ఆశ చూపించాను. అందుకు వారు అంగీకరించారు. మొత్తం ఆవుల్ని, మేకల్ని వారికి స్వాధీనం చేశాను.

బిడారం బయలుదేరింది. అరబ్బు దిశన! మజిలీలు దాటుకుంటూ మేము ముందుకు సాగాము. నా సర్వస్వం వారికి ధారపోసినా నాకు సంతృప్తిగానే ఉంది. నా మనస్సంతా అరబ్బు ప్రవక్త ఆలోచనలతో నిండికొని, ప్రపంచాన్ని జయించినంత సంబరంగా ఉంది. మేము "వాదియే కురా" (కురా అనే లోయ) చేరాము. బిడారం వాళ్ళు నన్ను మోసగించారు. నన్ను అన్యాయంగా ఒక యూదునికి బానిసగా అమ్మివేశారు. ఫలితంగా నేను అత్యంత నికృష్ట జీవితం గడపవలసి వచ్చింది. యూదుని

తోటల్లో పగలల్లా చాకిరి చేయటం, కాపలాకాసి, మంచి చెడు చూడటం నా పని! రాత్రులంతా దేవుని సమక్షాన నిలచి దీనాతి దీనంగా వేడుకుంటూ ఉన్నాను, "ప్రభూ! నన్ను ఆఖరి ప్రవక్త సన్నిధిన చేర్చు! పరాత్పరుడా, నా కష్టాలు కడతేర్చు!" అంటూ. కష్టాలయినా సుఖాలయినా ఆగని కాలం గడిచిపోతూనే ఉంటుంది. మానవాళికి ఆఖరి మార్గదర్శి ఈ దేశంలోనే జన్మిస్తారని నా అంతరాత్మ బోధిస్తూవుంది. ఆ మహనీయుడు, మానవాళికి దేవుని ఏకత్వపు మాధుర్యాన్ని చవిచూపిస్తారు. బలహీనుల బానిసత్వపు సంకెళ్ళు తెంచేస్తారు. నేను జీవించటానికి ఈ భావాలు ఊపిరిలా పని చేశాయి. నాలో నూతనోత్సాహాన్ని నింపడానికి ఈ ఆలోచనలే ముందుగా పని చేశాయి. నా కష్టాలు, కడగండ్లు మరచిపోవడానికి ఈ ఒక్క ఆశ మటుకే చాలనిపించింది. కాలచక్రం తిరుగుతూనే ఉంది!

ఒకసారి మదీనా నుండి యూదుని బాబాయి కొడుకు వచ్చాడు. నా గురించే మాట్లాడుకుంటున్నారు. అతను నన్ను తన బానిసగా కొనుక్కున్నాడని వారి మాటల ద్వారా చూచాయగా తెలిసింది. నా ఊహ నిజమయింది.

క్రొత్త యజమాని వెంట మదీనాకు బయలుదేరాను. త్వరలోనే మదీనా చేరాను. ఈ నగరం నాకెంతో నచ్చింది. ఇక్కడ ప్రతి విషయం, ప్రతి వస్తువు కూడ చూడముచ్చటగా ఉంది. అమూరియా ఫాదర్‌గారు చెప్పిన గుర్తులు ఒక్కొక్కటిగా నా మనసున మెదులుతున్నాయి. "రెండు నల్లని కొండలు", "ఖర్జూరపు తోటలు" .... ఆ.. ఆ.. అవే గుర్తులు! ఈ ఆలోచన కలుగగానే ఆనందాతిశయంతో పులకరించిపోయాను. దేవుని తుది సందేశహరుడు ఈ నగరానికి నిజంగా వలస వస్తారని చెప్పడానికి ఏ గట్టి ఆధారమూ దొరకకపోయినా ఈ నగరానికి ఆయన తప్పక వస్తారని నా మనస్సు సాక్ష్యం పలికేది!

మనసున నిండిన ఈ ఆశతోనే సంతోషంగా కాలం వెళ్ళదీస్తున్నాను. అరబ్బు ప్రవక్త (సఅసం) గారు మక్కా నగరాన తాము దైవప్రవక్తనని చాటుకున్న రోజులవి! దైవదాసులు ప్రవక్త బోధించిన ఏకేశ్వరవాదాన్ని నమ్మి, విశ్వాస మాధుర్యాన్ని గ్రోలుతూ, తరిస్తున్న రోజులవి! కానీ నాకెలా తెలుస్తుంది? నాకయితే ఈ బానిసత్వపు సౌభాగ్యంలో తీరికెక్కడిది?

ఓ రోజు అనుకోకుండా ఓ విచిత్ర సంఘటన జరిగింది. నేను ఖర్జూరపు

చెట్టునెక్కి ఏదో పని చేస్తున్నాను. చెట్టు క్రింద నా యజమాని కూర్చొని వున్నాడు. దూరం నుండి అతని బాబాయి కుమారుడు వడివడిగా వస్తున్నాడు. వచ్చీరాగానే ఆత్రంగా "అన్నయ్యా! ఇది విన్నావా?" అని అడిగాడు.

"ఏమది తమ్ముడూ" ప్రశ్నించాడు యజమాని.

"అరే! బనీ ఖీలా వంశస్తులను గురించి నీవేమీ వినలేదా? మక్కా నుండి ఓ బాటసారి వచ్చి 'ఖుబా'లో విడిదిచేసి వున్నాడు. అతనితోపాటు కొందరున్నారు. అతనెవరోగానీ నేను దైవ సందేశహరుడనని, నా వద్దకు దైవ సందేశం వస్తుందని, ఏదేదో చెప్పేస్తున్నాడు పాపం! బనీ ఖీలాకు చెందిన అమాయకులు ఆయన గారిని నమ్మి చుట్టూ మూగారు" అన్నాడు ఆ తమ్ముడు!

చెప్పటమూ, వినటమూ పూర్తి అయ్యీ అవకముందే నా మనసు స్వాధీనం తప్పింది. వళ్ళంతా వణికిపోయింది. రోమాలు నిక్కపొడుచుకున్నాయి. క్రిందనున్న యజమాని మీద ఎక్కడ పడిపోతానోనని భయం వేసింది. అతి ప్రయత్నంతో మనస్సునూ, శరీరాన్ని కొంచెం అదుపులో ఉంచుకోగలిగాను. నెమ్మదిగా చెట్టు దిగి ఆ వ్యక్తిని చేరి "దొరా! చెప్పండి, మళ్ళీ చెప్పండి! తమరు సెలవిచ్చిన ఆ శుభవార్త ఏమిటి?" ఇక నా నోట మాట పెగలటం లేదు. నా ఆత్రుత చూసి యజమాని సహించలేకపోయాడు. శక్తి కొలది ఒక గ్రుద్దు గ్రుద్దాడు! బెదిరిస్తూ, "పదరా! పద! ఊళ్ళోని విషయాలతో నీకేం పనిరా! నీ పని నీవు చూసుకో పోరా! పో" రంకెలేశాడు కోపంగా. కానీ అప్పుడు నేను బానిసనన్న స్పృహ నాకెక్కడిది?

ఆయన దగ్గరకెళ్ళి వినయంగా, నమ్రతతో "నాక్కూడా కాస్త తెలుసులెండి! తమ తమ్ముడుగారు ఎవరి రాక గురించి చెబుతున్నారో నేను బాగా అర్థం చేసుకోగలను" అన్నాన్నేను మధ్యలోనే. వెంటనే అక్కడి నుండి తప్పుకొని నా పనిలో నేను నిమగ్నమయ్యాను. ఎప్పుడు ప్రొద్దుగ్రుంకుతుందా, పని అయిపోయి ఎప్పుడు తీరిక దొరుకుతుందా అని క్షణాలు లెక్కిస్తున్నాను.

సాయంత్రమవుతూనే పని ముగించుకొని తినుబండారాలు కొన్ని తీసుకొని పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ 'ఖుబా' వైపునకు వెళ్ళాను. ఆయన(స) అక్కడ వేంచేసి వున్నారు. నేను అక్కడికి వెళ్ళి కూర్చొని తినుబండారాలు వారికి సమర్పించుకుంటూ–

"అయ్యా! మీరు మక్కా నుండి దయచేశారని తెలిసింది. కొందరు బాటసారులు కూడా మీతో ఉన్నట్లు తెలిసింది. నా దగ్గర దానం రూపేణ లభించిన ఈ కొన్ని తినుబండారాలు మాత్రమే వున్నాయి. వీటిని సేవించేందుకు మీ కంటే యోగ్యులెవరూ? దయచేసి స్వీకరించండి, అనుగ్రహించండి" అన్నాను అభిమానంతో. నా చేతిలోని వస్తువులన్నింటినీ ఆయన తీసుకొని తోటి వారికందించి తినేందుకు అనుమతించారు. కాని ఆయన మాత్రం వాటి రుచి కూడా చూడలేదు, లోలోపలే నా మనసు పులకరించింది. "పరాత్పరుడా నీకు కృతజ్ఞతలు!" మొదటి గుర్తు తగిలింది. ఆయన పవిత్ర ముఖారవిందం వీక్షిస్తూ ఆయన పలుకులు వింటూ ఉంటే అక్కడి నుండి కదలాలన్న ధ్యాసే కలుగలేదు. అట్టి స్థితిలోనే కొంత సమయం అక్కడ గడిపి వచ్చి మళ్ళీ నాపనిలో నేను లీనమయిపోయాను.

నాకిపుడు ఒకటే ధ్యాస! శీఘ్రంగా ఆయనగారి దర్శనభాగ్యం పొందాలని. అదే లక్ష్యం! అదే ఉత్సాహం! మరికొన్ని తినుబండారాలు సమకూర్చుకున్నాను. వాటిని తీసుకొని ఆ మహనీయుని వద్దకు బయలుదేరాను. ఇప్పుడు ఆయన నివాసం 'ఖుబా' నుండి మదీనాకు మారింది. నేను ఆయన సమక్షంలో హాజరై తీసుకెళ్ళిన వస్తువులను ఆయన ముందుకు జాపాను.

"అయ్యా! మీరు దానం స్వీకరించరని గ్రహించాను. ఈ కొన్ని పదార్థాలు కానుక రూపేణ తెచ్చాను. దయచేసి అనుగ్రహించండి!" అభ్యర్థించాన్నేను. ఆయన (సఅసం) అన్నింటినీ ఆప్యాయంగా స్వీకరించి తానూ ఆరగించారు. తన సహచరులకూ ఇచ్చారు. నా ఆనందం అవధులు దాటింది. ఆ పరాత్పరునికి వేనకువేలు కృతజ్ఞతలు! రెండో చిహ్నం కూడా సరిపోయింది.

మూడోసారి నేను ఆయన (సఅసం) సన్నిధికి వెళ్ళినపుడు ఆయన (సఅసం) తన అనుచరుల్లో ఒకరి అంత్యక్రియల్లో పాల్గొనడానికి స్మశానానికి వెళ్ళి ఉన్నారు. అక్కడ ఆయన తలపాగా ధరించి, భుజాలపై నుండి ఓ దుప్పటి కప్పుకుని అనుచరుల మధ్య కూర్చుని ఉన్నారు. నేను ఆయన ముందుకెళ్ళి సలాం చేశాను. అందరిలా నేను వారి ముందు కూర్చోలేదు. అటూ ఇటూ తచ్చాడుతున్నాను. ఏదో రకంగా ఆయన వీపును చూసే భాగ్యం కలుగుతుందేమోనని గంపెడాశ!

నా ఉద్దేశ్యం గ్రహించారు కాబోలు, తను భుజాల నుండి దుప్పటిని నెమ్మదిగా క్రిందకు జార్చారు. నా నిరీక్షణ ఫలించింది!

నా అదృష్టం పండింది!

నా హృదయం ఉత్తుంగ తరంగాలవలే ఉవ్వెత్తున ఎగిసింది. ఆయన (సఅసం) వీపున దైవదౌత్యపు పవిత్ర ముద్రను కళ్ళారా దర్శించుకున్నాను. అప్రయత్నంగా దానిపైకి వంగాను. ఆనందభాష్పాల కట్టలు తెంచుకున్నాయి. ఆత్రంగా ఆ పవిత్ర ముద్రను ముద్దాడుతూనే ఉన్నాను. నా కన్నీటితో ఆ ముద్రతో పాటు ఆయన (సఅసం) వీపు సైతం తడిసింది.

నా హృదయాంతరాళాల నుండి వెలువడింది **"అష్హదు అల్లాయిలాహ ఇల్లల్లాహ్ వ అష్హదు అన్న ముహమ్మదన్ అబ్దుహూ వ రసూలుహూ"**

"నేను సాక్ష్యమిస్తున్నాను - అల్లాహ్ తప్ప మరో దేవుడు లేడు. ఇంకా నేను సాక్ష్యమిస్తున్నాను, ముహమ్మద్ (సఅసం) దేవుని దాసులు, ఆయన సందేశహరులు అని కూడా."

ఈ స్థితిలో కొంతసేపు గడిచింది. తరువాత ప్రవక్త శేఖరులు నన్ను వాత్సల్యంతో ముందుకు తీసుకున్నారు. నేను ఆయన ముందుకు వచ్చి ముంగాళ్ళ మీద కూర్చున్నాను. నా పయనగాథను పూర్తిగా వినిపించాను. ఎంతో ఆసక్తితో ఆలకించారు ప్రియమైన ప్రవక్త (సఅసం).

పవిత్రమయిన సద్వచనాన్ని మనస్ఫూర్తిగా స్వీకరించి ముస్లింనయ్యాను. ఇప్పుడు నా పేరు "సల్మాన్" - 'సల్మాన్ ఫార్సి' విశ్వాస భాగ్యం, ఇస్లాం సౌభాగ్యంతో నన్ను సుసంపన్నం చేసిన సకల లోక ప్రభువుకు ఎనలేని కృతజ్ఞతలు! నా జీవితం ఆయనకే అంకితం!

నా సమస్య ఇప్పుడు ఒక్కటే! దైవదాస్య భాగ్యం కలగాలంటే, యూదుని దాస్యం నుండి విముక్తి పొందాలి. ఎలా ... ? స్వేచ్ఛ కొరకు యూదునితోనే సంప్రదించవలసిందిగా ప్రవక్త (సఅసం) సలహా ఇచ్చారు. నేను నా యూదు యజమానిని స్వేచ్ఛ కొరకు అభ్యర్థించాను. అతను అందుకు అంగీకరించాడు గాని, కొన్ని షరతులు పెట్టాడు.

ఒకటి : యూదునకు 40 ఔఖియాల (40 ఔన్సుల) బంగారం ఇచ్చుకోవాలి.

రెండు : 300ల ఖర్జూరపు మొక్కలు నాటాలి.

మూడు : మొక్కలు మ్రానులయి ఫలసాయం ఇచ్చిన తరువాతనే నాకు విముక్తి!

నా ఆశ అడియాసే అయింది. శిఖరాగ్రం నుండి క్రిందికి తోసినట్లయింది నా పరిస్థితి. యూదుడు విధించిన షరతుల గురించి నా ముస్లిమ్ సోదరులు విన్నవెంటనే 40 ఔన్సుల పసిడి, మూడు వందల ఖర్జూరపు మొక్కలు సిద్ధం చేశారు. ప్రవక్త స్వయంగా తమ పవిత్ర హస్తాలతో ఆ మొక్కలు నాటారు. దైవికంగా అదే సంవత్సరం మొక్కలు ఫలించాయి. అందరి ఆనందం ఎల్లలు దాటింది. ప్రియప్రవక్త (సఅసం) గారు యూదునికి ధనం చెల్లించి నన్ను దాస్యవిముక్తుణ్ణి చేశారు.

ఇప్పుడు నేను ఎల్లవేళలా ప్రవక్తాశ్రేష్ఠుల (సఅసం) వారి వెన్నంటే వుంటున్నాను. నా ప్రాణంలో ప్రాణం వారు! నా కంటికి వెలుగు వారు!

ఒకసారి అన్సారులు, (మదీనావాసులు) ముహాజిరుల (మక్కా నుండి వలస వచ్చినవారు) మధ్య ఓ మధురమైన కలహం జరిగింది.

సల్మాన్ ఫార్సీ (రజి) ఎక్కడి నుంచో "వలస" వచ్చారు గనుక ఆయన మా మనిషేనని ముహాజిర్లు అన్నారు.

మీ రాకకు మునుపే సల్మాన్ ఫార్సి (రజి) మదీనా వాసులయి ఉన్నారు గనుక ఆయన మా మనిషేనని అన్సారులు అన్నారు.

ప్రియప్రవక్త (సఅసం) "సల్మాన్ (రజి) నా వారసుడు! నా మనిషి!" అన్నారు వారి వాదనలను ఖండిస్తూ!

నాకు నేనయితే ఎప్పుడూ అనుకుంటూనే ఉంటాను, "నేను ఇస్లాం పుత్రుణ్ణి!" "సల్మాన్ ఇబ్నె ఇస్లామ్‌ను."



అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడైన అల్లాహ్ పేరుతో

# ముహమ్మద్ ఇబ్నె ఇద్రీస్ షాఫిఈ (రహ్మా)

నాకు మొదటి నుండీ ధార్మిక జ్ఞానార్జనలో అభిలాష ఎక్కువే! పిన్న వయసులోనే ఎంతో కొంత ధార్మిక విద్య నేర్చుకున్నాను. పవిత్ర ఖుర్ఆన్ కంఠస్తమూ చేశాను. మహాప్రవక్త (సల్లల్లాహు అలైహి వ సల్లమ్) ఉపదేశాలను కూడా అధిక సంఖ్యలో మనసులో పదిలపర్చుకున్నాను. ఏ ధార్మిక పండితుని గురించి విన్నా ఆయన్ని కలిసే వరకు నాకు తృప్తి కలిగేది కాదు. ఏదో విధంగా ఆయన్ని ఆశ్రయించి ఎన్నో కొత్త కొత్త విషయాలు తెలుసుకునేవాడిని. పధ్నాలుగేళ్ళ వయస్సులోనే నేను ఉన్నత ధార్మిక విద్య నేర్చుకోవడానికి సుదూర ప్రయాణం చేయ నిశ్చయించుకున్నాను. నా వృద్ధ మాతృమూర్తికి నా కోరిక వెల్లడించుకున్నాను. వృద్ధాప్యంలో ఉన్న మా తల్లికి సేవ చేసేందుకు మా ఇంట్లో నేను తప్ప మరెవ్వరూ లేరు. ఈ స్థితిలో ఆమె నా అభ్యర్థన విని మౌనంగా ఉండిపోయింది.

అయితే నా కోరిక క్రమేణా పెరుగుతూనే ఉంది. రోజు రోజుకు పెరిగే నా ఆసక్తిని గ్రహించి చివరకు మా అమ్మ విద్యార్జన కోసం నన్ను పంపేందుకు సిద్ధమయ్యింది. కానీ ఆమె ముఖంపై ఆవరించి ఉన్న విచారాన్ని నేను గమనించాను. లోలోపల దిగులు పడుతున్నా పైకి గంభీరంగా ఉన్నట్లు ప్రయత్నిస్తోంది. ఆమె స్థితి నా గుండెను కలచి వేసింది. నేను నా తలను ఆమె భుజంపై ఆనించి "అమ్మా! నా ప్రయాణం నీకు ఆందోళన కలిగిస్తుంటే నేను వెళ్ళనులే. ఇక్కడే ఉండి నీ సేవ చేసుకుంటూ ఆ దేవుడు ప్రసాదించిన మేరకే విద్య నేర్చుకుంటాను. దిగులుపడకమ్మా!!" అన్నాను.

ఈ మాటలతో ఆమె హృదయం ద్రవించి కళ్ళ నుండి అశ్రువులు ధారగా కురిశాయి.

"లేదు....నాయనా! నిజానికి నీ ఆసక్తి, నీ పట్టుదల నా కలల పంటే బాబూ! నీకేం తెలుసు? నీ కోసం నేను ఎన్ని రాత్రులు దేవుని సన్నిధిలో నా చెరుగు చాపి ప్రార్థించానో; ప్రభూ! నా బంగారు కొండను నీ ప్రియ ప్రవక్త ప్రవచనాలతో సంపన్నుని చెయ్యి. నా బిడ్డకు మహత్తర జ్ఞాన జ్యోతిని ప్రసాదించు. దాని వెలుగులో యావత్తు ముస్లిం జగత్తు ఆచంద్రతారార్కం నీ ధర్మమార్గాన నడవగలిగేలా చెయ్యి" అని వేడుకునేదాన్ని; బాబూ! నేను దిగులు పడుతున్నది నిన్ను పంపడం గురించి కాదు, అంతటి దూర ప్రయాణంలో నీకేమిచ్చి పంపిద్దామా అని! ఏవయినా పిండి వంటలు చేద్దామంటే ఇంట్లో సరుకులే లేవు. పోనీ, దారి ఖర్చుకైనా ఇద్దామంటే చేతిలో చిల్లిగవ్వ కూడా లేదు." ఆమె గొంతు బొంగురుపోయి కళ్ళు కురిశాయి.

ఆమె మాటలు వినగానే నా కళ్ళు కూడా అప్రయత్నంగా అశ్రు పూరితాలయ్యాయి. "విచారించకు నాయనా, ఎవరి ప్రసన్నత కొరకు బయలుదేరుతున్నావో, ఆ దేవుడే స్వయంగా నీ కోసం అన్ని ఏర్పాట్లు చేస్తాడు. అతడు తన భక్తులను ఎన్ని విధాల ఆదుకుంటాడో మనిషి హ్రస్వ దృష్టికి ఆనదు" అన్నది ఆమె నన్ను ఓదార్చుతూ.

మా అమ్మ నాకు రెండు పొడవైన దుప్పట్లనిస్తూ, "వెళ్ళిరా నాయనా, నీవు దేవుని సొత్తువి, నిన్ను ఆయనకే అప్పగిస్తున్నాను. నీ ప్రయత్నం ఆయన ఎన్నటికీ వృధా చేయడని నాకు నమ్మకముంది" తల నిమిరి నన్ను కౌగిలించుకున్నారు. నా కళ్ళు తుడిచి తన రెండు చేతులూ ఆకాశం వైపునకు ఎత్తి, "ఆపద్బాంధవా! నా ప్రాణంలో ప్రాణాన్ని నీ మార్గంలో అర్పిస్తున్నాను. నీ ప్రియ సందేశహరుని బోధనలు అభ్యసించడానికి పంపిస్తున్నాను. అమిత దయాళువు నీవు, ఈ దీనురాలి ప్రార్థన మన్నించి, నా కుమారునికి విద్యాసక్తిని కలిగించావు. అలాగే, నిస్సహాయ స్థితిలో అతను సాగిస్తున్న ఈ ప్రయాణంలో అతనికి తోడుగా నిలువు. నీ అదృశ్య సహాయాన్ని అందించు. ఓ సర్వజ్ఞానీ! నా మనోభిలాష ఈడేరి ఈ మొక్క పెరిగి, ధార్మిక వృక్షమై ఫలవంతమవగా చూసి తరించి పరవశించే ఆ రోజు త్వరగా తీసుకు రా స్వామీ!" అని దేవుని ప్రార్థించారు మా అమ్మ.

నా వీపు నిమిరి, "వెళ్ళు...! వెళ్ళిరా నాయనా! దేవుడు నిన్ను విజ్ఞాన వినీలాకాశంలో సూర్యుని వలె ప్రకాశింపజేయుగాక! పోయిరా బాబు! దేవుడే నీకు రక్ష!"

అని పలుకుతూ వీడ్కోలు చెప్పారు. రిక్త హస్తాలతో, మా అమ్మ ఆశీర్వాద భాగ్యంతో, దేవుని మీద భారం ఉంచి ఇంటి నుండి బయలుదేరాను.

నేను మక్కా నుండి బయలుదేరి 'జీతవా' అనే ప్రదేశానికి చేరుకున్నాను. అక్కడో బాటసారుల బిడారం కనిపించింది. వారిని సమీపించి సలామ్, యోగక్షేమాలు విచారించిన తరువాత నేను అక్కడే ఆగిపోయాను. అక్కడ బిడారానికి నాయకునిగా కనిపించిన ఓ పెద్దాయన నన్ను ఆదరించారు. అమిత వాత్సల్యంతో నన్ను వారితోపాటే భోజనం చేయమని కోరారు. వారి కోరికను మన్నించి వారి సహపంక్తిన మొహమాటపడకుండా భోంచేయ నారంభించాను. వారంతా అయిదు వేళ్ళతో తింటున్నారు. నాకు మూడు వ్రేళ్ళతోనే తినటం అలవాటు. వాళ్ళను చూసి నేనూ అయిదు వేళ్ళతో తినటం మొదలెట్టాను. నన్ను వారు పరాయి వానిగా భావించకుండా ఉండేందుకు! తినటం ముగించి, నీళ్ళు త్రాగి ప్రార్థనా వాక్యం పలికాను.

“మాకు తినిపించి, త్రాగించి మమ్మల్ని ముస్లిములుగా చేసిన ఆ దేవునికి కృతజ్ఞతలు” అంటూ తెలిపే వేడుకోలు వాక్యాన్ని పలికాను.

నాకు ఆతిథ్యమిచ్చిన పెద్దాయననుద్దేశించి కృతజ్ఞతగా రెండు మూడు కవితలు ఆశువుగా చెప్పాను.

భోజనానంతరం కుశల ప్రశ్నలు, పరామర్శలు మొదలయ్యాయి. ముందుగా పెద్దాయన అడిగారు.

“నాయనా! నీవు మక్కా నివాసివా?”

“అవునండి”

“నీవు ఖురైషు వంశానికి చెందినవాడివా?”

“అవునండి! నేను ఖురైషు వంశస్థుడినే! కానీ.... నేను మక్కా నివాసిననీ, ఖురైషు వంశస్థుడననీ, మీరెలా చెప్పగలిగారు?”

“బాబు! ఇదేమంత పెద్ద విషయం కాదు. ప్రయాణాలు చేస్తూ లోకానుభవంతోనే నాకు పెద్దతనం వచ్చేసింది. నీ వేష భాషలు చూసి నీవు నగర నివాసివి అయి ఉంటావనుకున్నాను. మొహమాట పడకుండా నీవు భోంచేసిన తీరు చూసి నీవు

ఖురైషీవి అయివుంటావని ఊహించాను. ఇతరుల చెంత నిర్మొహమాటంగా భోంచేసేవారు, తాము కూడా ఇతరులకు మనస్ఫూర్తిగా ఆతిథ్యమిచ్చి సంతోషిస్తారు. దేవుడు ఆ సద్గుణ సంపత్తి ఒక్క ఖురైషీయులకే ఇచ్చాడు."

"బాబాయి గారూ! తమ నివాస మెక్కడ?"

"దైవ సందేశహరుల (స) నగరం .... పవిత్ర మదీనా నా మాతృభూమి."

"బాబాయ్, ప్రస్తుతం మదీనాలో గొప్ప ధార్మిక విద్యావేత్త ఎవరో చెప్పగలరా?"

"ధర్మవిద్యలో గొప్పపండితులు.... 'బనీ అస్బహ్' నాయకులు - హజ్రత్ మాలిక్ బిన్ అనస్ (రహ్మ)! దైవం ఆయన గౌరవాన్ని అధికం చేయుగాక!"

"ఆమీన్!" అన్నారు నిశ్చల హృదయంతో.

"బాబాయి గారూ! హజ్రత్ మాలిక్ (రహ్మ) గౌరవ సమ్ముఖానికి వెంటనే చేరాలని నా మనసు తహతహ లాడుతోంది. నా అభిలాషను తీర్చేవాడు ఆ దేవుడే!" అన్నాను నిట్టూర్చుతూ.

"నీ మాటల్నిబట్టి, నీ సంతోషాన్నిబట్టి నేను గ్రహించానయ్యా! నీవు ధర్మవిద్యా ప్రాప్తి కొరకు ఇంటి నుండి బయలుదేరావని" - పెద్దాయన స్వరంలో సంతోషం, మృదుత్వం, ఆప్యాయత ఉట్టిపడుతున్నాయి.

మస్జిద్‌లో ఓ మహనీయుడు ఎంతో మర్యాదపూర్వకంగా కూర్చుని కనిపించారు. ఆయన చుట్టూ యువకులు కొందరు అర్థచంద్రాకారంలో వినమ్రులై మౌనంగా కూర్చుని ఉన్నారు. ఆ పెద్ద మనిషి బోధిస్తూ ఉంటే యువకులంతా ఆసక్తిగా ఆలకిస్తున్నారు. ఆ మహనీయుని ముఖం విజ్ఞాన కాంతులతో వెలిగిపోతోంది. ఆయన ఒక దుప్పటి నడుమున కట్టుకుని మరో దుప్పటి భుజాలపై కప్పుకున్నారు. భక్తి భావంతోనే కాని కొంచెం హెచ్చుస్వరాన ఉపదేశిస్తున్నారు -

"నాతో నాఫె, నాఫెతో ఇబ్నె ఉమరు ఇలా ఉల్లేఖించారు : 'ఈ సమాధిలో విశ్రాంతి పొందుతున్నవారు (స) నాకు ఇలా ఉపదేశించారు ....' అంటూ కుడి చేత్తో ప్రవక్త (స) సమాధి వైపునకు సైగ చేస్తూ హదీసు ఉల్లేఖిస్తూ ఉండగా హదీసు ప్రియులు ఎంతో వినయంగా ప్రశాంతంగా కూర్చొని నేర్చుకుంటున్నారు."

నేను కూడా నేలమీద ఓ పుల్ల తీసుకొని ఇమాం సాహెబ్ హదీసు బోధిస్తుండగా, పుల్లను నోటితో తడిపి అరచేతిపై వ్రాయడం మొదలుపెట్టాను. ఇమామ్ మాలిక్ (రహ్మ) నన్ను గమనిస్తున్నారేమో నాకు తెలియదు. కొంతసేపటికి సమావేశం ముగిసింది. శిష్యులు ఒక్కొరొక్కరే లేచి వెళ్ళిపోతున్నారు. ఇమామ్ మాలిక్ (రహ్మ) నన్ను తదేకంగా చూస్తున్నారు. అందరూ వెళ్ళిపోయినా నేను అక్కడే ఉండిపోయాను.

ఇమామ్ మాలిక్ (రహ్మ) చేతిసైగతో నన్ను తన దగ్గరకు పిలిచారు. నేను దగ్గరకెళ్ళి వినయంగా కూర్చున్నాను. కాస్సేపు నన్ను పరిశీలనగా చూశారు. "నీవు మక్కా నివాసివా?" అనడిగారు నన్ను.

"అవునండి!" జవాబిచ్చాను.

"దేవుని దయవల్ల అన్నీ మంచి గుణాలే అబ్బాయి కాని నీవో మర్యాదలేని చర్యకు పాల్పడ్డావు" మందలింపుగా అన్నారు.

నేను వణికిపోయాను. కొంచెం ముందుకు జరిగి, "చెప్పండి ... మహాశయా! నేను చేసిన ఏ పని మిమ్మల్ని బాధించింది?" అనడిగాన్నేను.

"నేను దేవుని సందేశహరుని (స) హదీసు బోధిస్తుంటే, నీవు జాగ్రత్తగా వినకుండా పుల్లలతో ఆడుకుంటున్నావు" – అన్నారు ఇమామ్ సాహెబ్.

నాకు నెమ్మది కలిగింది. అత్యంత వినయ వినమ్రతలతో "నిజానికి నేను ఆడుకోలేదండి! తమరు బోధించిన హదీసులను మరువకుండా ఉండేందుకని అరచేతిపై పుల్లతో వ్రాసుకున్నాను. వ్రాసుకునేందుకు నా దగ్గర ఏమీ లేనందున గత్యంతరం లేక అలా చేశాను. తప్పయితే మన్నించండి." అని అంటుండగా హజ్రత్ మాలిక్ (రహ్మ) విస్మయంగా నన్ను అలాగే చూస్తుండిపోయారు కొంతసేపు!

నా చేతిని తమ వైపు లాక్కుని చూశారు.

"ఈ చేతిలో ఏమీ వ్రాసినట్లు లేదు గదయ్యా!" ప్రశ్నించారు సందేహంగా.

"అయ్యా! నోటిలో పుల్ల తడిపి వ్రాశాను. ఆరిపోయింది. ఆ.. అయినా... తమరు బోధించిన హదీసులన్నీ ... దేవుని కృపానుగ్రహాల వల్ల నాకు కంఠస్థమయ్యాయి" భయంగా నా నిర్దోషిత్వాన్ని నిరూపించడానికి సిద్ధమయ్యాను. ఇమామ్ సాహెబ్ మరింత ఆశ్చర్య చకితులయ్యారు.

"అన్నీ అక్కర్లేదు గాని ... ఒక హదీసు పూర్తిగా చెప్పు ... చాలు!" అన్నారు అనుమానంగానే!

వెంటనే అందుకున్నాను.

"నాతో మాలిక్ (రహ్మా), మాలిక్ (రహ్మా)తో నాఫె, నాఫెగారితో ఇబ్నె ఉమర్ ఇలా ఉల్లేఖించారు - "ఈ సమాధిలో విశ్రాంతి పొందుతున్న వారు (స) నాకు ఇలా ఉపదేశించారు...." అంటూ వారు సైగ చేసినట్లుగానే కుడిచేత్తో పవిత్ర సమాధి వైపునకు సైగచేస్తూ పూర్తి హదీసు వినిపించాను. ఆ పూట మాలిక్ (రహ్మా) గారు బోధించిన 25 హదీసులను కూడా అలాగే ... పొల్లు పోకుండా అప్పజెప్పాను. ఇమామ్ మాలిక్ (రహ్మా) సంభ్రమాశ్చర్యాలతో అవాక్కయ్యారు కాస్సేపు. అంతకన్నా అధికంగా సంతోషించారు.

అప్పటికి బాగా చీకటి పడుతోంది. ఇషా నమాజ్ చేసుకున్నాము. నమాజ్ తరువాత హజ్రత్ మాలిక్ (రహ్మా) నన్ను చూపిస్తూ తన నౌకరుతో -

"నీ యజమానిని వెంట బెట్టుకొని ఇంటికి పద ...!" అన్నారు. తరువాత నన్నుద్దేశించి - "పదండి ... ఇంటికి దయచేయండి!" అని ఆహ్వానించారు.

సంభ్రమాశ్చర్యాలకు లోనవడం ఇప్పుడు నా వంతయింది. కాని గురువు ఆదేశాన్ని శిరసావహిస్తూ వెంటనే లేచి నౌకరు వెంట ఇమామ్ మాలిక్ (రహ్మా) గారి ఇంటికి వెళ్ళాను. అక్కడ చేరగానే నౌకరు నన్ను ఒక చిన్న గదిలో కూర్చోబెట్టి, "ఖిబ్లా" దిశ చూపించి, మంచినీళ్ళ పాత్ర, మరుగుదొడ్డి ఇత్యాది అవసరాలను గురించి తెలిపి వెళ్ళిపోయాడు. కాస్సేపటికి ఇమామ్ మాలిక్ (రహ్మా) స్వయంగానే వేంచేశారు గదిలోకి! వెంట నౌకరు! నౌకరు చేతిలో ఒక పళ్ళెం, అందులో భోజన సామగ్రి! ఇమామ్ సాహెబ్ సలామ్ చేశారు. భోజనానికి స్వయంగా తానే ఏర్పాటు చేశారు.

చేతులు కడుక్కునేందుకు నీళ్ళు అందించవలసినదిగా నౌకరును ఆదేశించారు ఇమామ్ సాహెబ్. నౌకరు నీటిపాత్రతో నా వైపునకు వస్తుండగా వారించి "నీకు తెలీదా? ఆతిథ్యమిచ్చేవారు ముందుగా చేతులు కడుక్కోవాలని! మళ్ళీ - భోజనానంతరం అతిథి మాత్రం ముందుగా చేయి కడుక్కోవాలని" కాస్త చిరాగ్గానే అన్నారు హజ్రత్ మాలిక్. వారి ఈ విధానం నాకు చాలా నచ్చింది. అయినా కారణం అడిగాను. "ఎందుకంటే - ఆతిథ్యమిచ్చేవారు అతిథిని భోజనానికి పిలిచినందువల్ల ముందుగా

చేతులు శుభ్రపర్చుకొని అతనే దస్తర్ ఖాన్ వద్దకు చేరి అతిథిని ఆహ్వానించవలసి ఉంటుంది. భోజనం తరువాత ఆతిథ్యమిచ్చేవారు చివరన చేతులు కడుక్కోవాలి. ఎందుకంటే ఒకవేళ మరో అతిథి వచ్చినా అతనికీ తోడుగా కూర్చునే వీలవుతుంది" విశదీకరించారు ఇమామ్ సాహెబ్.

ఇమాం సాహెబ్ భోజన పళ్ళెం (ట్రే) పై మూతతీశారు. అందులో రెండు పాత్రలున్నాయి. ఒక దానిలో పాలు, మరో దానిలో ఖర్జూరపు పండ్లు. ఇమామ్ సాహెబ్ (రహ్మ) బిస్మిల్లాహ్ అంటూ ప్రారంభించారు. నేనూ 'బిస్మిల్లాహ్' అని మొదలెట్టాను. భోజనం అయింది. ఇద్దరిలో ఎవరికీ కడుపు నిండలేదని గ్రహించారు ఇమామ్ మాలిక్ (రహ్మ).

"తమ్ముడూ, ఒక నిరుపేద, మరో నిరుపేదకు ఇవ్వగలిగింది ఇంతేనేమో!" అంటూ నొచ్చుకుంటూనే చమత్కరించారు.

"గురూజీ! తమరు నన్ను ఎంతగానో అభిమానించి ఎంతో సహాయం చేశారు. ఇదే నా సౌభాగ్యం. తమరు బాధపడకండి. తప్పు చేస్తే కదా బాధపడవలసింది?" అన్నాను ఆత్మీయతతో. భోజనానంతరం ఇమామ్ సాహెబ్ (రహ్మ) చాలాసేపు నా దగ్గరే కూర్చున్నారు. బాగా రాత్రి అయ్యేవరకు మాట్లాడుకుంటూనే ఉన్నాము. మక్కావారి యోగక్షేమాలు, స్థితిగతుల గురించి ఇమామ్ సాహెబ్ (రహ్మ) గారు వాకబు చేశారు. మాటల్లోనే కాలం గడిచింది. "బాగా రాత్రయింది, ప్రయాణ బడలికతో ఉంటారు. విశ్రాంతి తీసుకోండి" అంటూ ఇమామ్ మాలిక్ వెళ్ళిపోయారు. ఎన్నో రోజులుగా నిర్విరామ ప్రయాణం వల్ల నేను నిజంగానే బాగా అలసిపోయి వున్నానేమో, మేను వాల్చగానే గాఢ నిద్రపట్టింది.

ప్రాతఃకాలాన ఎవరో తలుపు తట్టిన చప్పుడయింది. 'మీపై దైవానుగ్రహం కురియుగాక! నమాజ్ వేళయింది. దయచేసి నిద్రలేవండి' అని ఎంతో ప్రేమతో మేల్కొలుపు పలుకుతున్నారు. నేను వెంటనే లేచి తలుపు తెరచి చూశాను! ఇంకేముంది? స్వయంగా ఇమామ్ మాలిక్ (రహ్మ) చేతిలో నీటి పాత్రతో ప్రత్యక్షమయ్యారు. త్వరగా నిద్రలేవనందుకు నాకయితే చాలా సిగ్గనిపించింది. ఇమామ్ సాహెబ్‌తో నా స్థితి దాగి ఉంటుందా? వెంటనే గ్రహించారు.

"తమ్ముడూ! ఫరవాలేదు. మనసులో ఏమీ పెట్టుకోకు! అతిథి మర్యాద

చేయవలసిందే గదా! అందులో నీవు దైవ సందేశహరుని (స) అతిథివి గదా! నీకు ఎంత సేవ చేసిన తక్కువే!" వాత్సల్యంతో అన్నారు ఇమామ్ మాలిక్ (రహ్మా).

ఇక నేను సత్వరమే నమాజ్ కొరకు తయారయి, ప్రవక్త మస్జిద్‌కు వెళ్ళి ఉదయం సున్నత్ నమాజ్ ముగించుకొని జమాఅత్‌తో ఫరజ్ నమాజ్ కొరకు లేచి నిల్చున్నాను.

కాస్సేపటికి ఇమామ్ మాలిక్ (రహ్మా) నమాజ్ చేయించేందుకు ముసల్లా (ఇమామ్ నిల్చునే స్థలం) వద్దకు చేరి ప్రశాంతంగా నమాజ్ చేయించారు. ఇమాం మాలిక్ (రహ్మా) నమాజ్ చేయించేందుకు నిలబడినపుడు చీకటిగానే ఉంది. నమాజ్ అయిన తరువాత కూడా ఒకరినొకరు గుర్తుపట్టలేనంత చీకటి ఉంది. నమాజ్ ముగిసిన పిదప జనమంతా ఎక్కడి వారక్కడే కూర్చొని దైవ సంస్మరణలో విలీనమయ్యారు. నేను కూడా అలాగే చేశాను.

దూరాన కొండల దాపు నుండి క్రమేణా సూర్యకాంతి కానరాసాగింది. ఇమామ్ సాహెబ్ నిన్నటి స్థానంలోనే, ఆసీనులయ్యారు. తాము సంకలనం చేసిన హదీసు గ్రంథం "ముఅత్తా" నా చేతికి ఇచ్చారు. భయంతో నా చేతులు వణికాయి. అయినా నిబ్బరంగా ఎంతో అణకువతో, శ్రద్ధగా పుస్తకం చదివి వినిపించసాగాను. విద్యార్థులు వ్రాయడం ప్రారంభించారు.

ఇదీ దినచర్య. ఇమామ్ మాలిక్ (రహ్మా) శిష్యరికంలో 8 నెలలు గడిచాయి. "ముఅత్తా" గ్రంథం సాంతం నాకు కంఠస్తమయిపోయింది.

ఈ ఎనిమిది నెలల సమయం నా జీవితంలో అత్యంత విలువైనవి. ఇమామ్ మాలిక్ (రహ్మా) చూపిన ప్రేమాభిమానాలు నా మనస్సును ఆకట్టుకున్నాయి. వారితో నేనెంతగా కలిసిపోయానంటే - ఎవరయినా అజ్ఞాత వ్యక్తి మా అన్యోన్యతను చూస్తే ఎవరికి, ఎవరు అతిథులో అర్థం చేసుకోలేకపోయేవారు.

హజ్ కాలం సమీపించింది. హజ్ యాత్ర ముగించుకొని ఈజిప్టు వాసులు కొందరు ఇమామ్ సాహెబ్ (రహ్మా) వద్దకు వచ్చి తాము "ముఅత్తా"ను వినగోరుతున్నట్లు తమ అభిలాషను వెలిబుచ్చారు. ఇమామ్ మాలిక్ (రహ్మా) తాము సంకలనం చేసిన ఆ విఖ్యాత హదీసు గ్రంథాన్ని క్రమం తప్పకుండా వారికి ఆసాంతం వినిపించారు.

ఆ ఈజిప్టువాసులు వెళ్ళిన తరువాత ఇరాక్ నుండి కూడా కొందరు ప్రవక్త (స) సమాధి దర్శనార్థం వచ్చారు. వారిని చూడాలనే కుతూహలంతో నేనూ వెళ్ళాను. అక్కడ సమాధికీ, మెంబరుకూ మధ్య ఓ నవ యువకుడు తెల్లని బట్టలు ధరించి నిల్చొని వున్నాడు. ఎంతో ప్రశాంతంగా, భక్తిభావంతో, వినమ్రుడయి నమాజ్ చేస్తున్నాడు. స్వరూప స్వభావాలను బట్టి మంచి వ్యక్తిలా కనిపించాడు. నమాజ్ ముగిశాక నేను అతనికి ఎదురు వెళ్ళి అడిగాను –

"అన్నయ్యా, మీరు ఏ దేశస్థులు?"

"మా దేశం ఇరాక్" జవాబిచ్చాడు.

"ఇరాక్ అంటే?!" సంభ్రమాశ్చర్యాలతో అడిగాను.

"కూఫా!" ముక్తసరిగా చెప్పాడు.

"కూఫా!" పేరు వినగానే కొన్ని మధుర గాథలు నా మదిలో మెదిలాయి. "అన్నగారూ! ఖుర్ఆన్, హదీసు గ్రంథాలలో బాగా పాండిత్యమున్నవారు కూఫాలో ఎవరున్నారో మీకు తెలుసని అనుకుంటా?" ఆసక్తిగా అడిగాన్నేను.

"అబూ యూసుఫ్, ముహమ్మద్ ఇబ్నె హసన్ వీరు ఇరువురూ మహనీయులు ఇమామ్ అబూ హనీఫా (రహ్మ) గారి ప్రముఖ శిష్యులు! కూఫాలో వీరే ధర్మజ్ఞానంలో నిష్ణాతులు."

"ఇరాక్‌కు మీరు ఎప్పుడు మరలిపోతున్నారో తెలియజేయగలరా?" అడిగాను.

"రేపు ఉదయం తెల్లవారు ఝామునే, మేము ఇక్కడి నుండి బయలుదేరుతున్నాము ఇన్‌షా అల్లాహ్!" తెలిపాడు ఆ నవ యువకుడు.

వింటూనే నేను పరుగెత్తుకుంటూ ఇమామ్ మాలిక్ (రహ్మ) గారి సమక్షంలో వాలాను.

"ఆచార్యా! నా విద్యాతృష్ణ మీకు తెలియనిది కాదు. అనంత విజ్ఞాన పథంలో నేనో బాటసారిని! నేను కేవలం, ఇతోధిక హదీసు విద్యాప్రాప్తి కొరకు ఇల్లు విడిచి వచ్చాను. కూఫాలో కూడా గొప్పగొప్ప హదీసువేత్తలు ఉన్నారని విన్నాను. అక్కడికి వెళ్ళి జ్ఞాన సముపార్జన చెయ్యాలని నా మనస్సు ఉబలాటపడుతోంది. ఇరాక్‌కు

చెందిన ఓ బిడారం రేపే కూఫాకు తిరుగు ప్రయాణానికి సిద్ధమయింది. నేను వారితో పాటు సునాయాసంగా ఇరాక్ చేరుకుంటాను ఇన్షా అల్లాహ్! అయ్యా దయచేసి అనుమతించండి" అని విన్నవించుకున్నాను.

ఇమామ్ సాహెబ్ (రహ్మ) నా వీపు తట్టి ధైర్యం చెప్పారు.

"తమ్ముడూ! విద్య అనంత సాగరం! దాని ప్రయోజనాలు అనేకం! విద్య ఎన్నటికీ తరగని పెన్నిధి. ధార్మిక విద్యార్థులకై దేవదూతలు తమ రెక్కలు పరుస్తారని నీకు తెలియంది కాదు! అవశ్యం వెళ్ళిరా నాయనా! మా ఆశీస్సులు సదా నీకు తోడై ఉంటాయి" - అని దీవించారు.

ఇమామ్ మాలిక్ (రహ్మ) ధైర్యవచనాలు విన్న నాకు మరింత ధైర్యం కలిగింది. ఇరాక్‌కు వెళ్ళేందుకు స్థిర సంకల్పం చేసుకున్నాను. ఆ ఇరాక్ బిడారం వారికి తెలిపాను, నేను కూడా వారితో వస్తున్నానని.

ఇమామ్ సాహెబ్ నా ప్రయాణ సన్నాహాలు చేశారు. అవసర సామగ్రి కట్టి సిద్ధం చేశారు. నన్ను ఆ ఇరాక్ వారి వెంట పంపిస్తూ వీడ్కోలు చెప్పడానికి తెల్లవారు ఝామునే మదీనా వెలుపలి 'బకీ' (జన్నతుల్ బకీ అనే ఖబరస్తాన్) వరకు వచ్చారు.

ఇమామ్ గారు మాతో పాటు 'బఖీ' దగ్గరి ప్రయాణ ప్రాంగణం చేరారు. "కూఫా చేర్చేందుకు బాడుగ ఒంటె దొరుకుతుందా?" అని బిగ్గరగా కేకవేశారు ఇమామ్ (రహ్మ) గారు. ఆశ్చర్యపోయాను. బాడుగ ఒంటె అంటే సామన్యమా మరి? ఇమామ్ (రహ్మ) గారు అనేకమార్లు అలా కేక వేస్తూనే ఉన్నారు, నేను నిశ్చేష్టుణ్ణయి, "అయ్యా! మీరు చేస్తున్నదేమిటో నాకు అర్థం కావటం లేదు. నా చేతిలోనైతే చిల్లిగవ్వ లేదు - తమ దగ్గరా లేదు! తమరి పరిస్థితి నాకు తెలియనిది కాదు. అద్దె ఒంటె ఏర్పాటు చేయబోతున్నారేమిటీ ఇది సాధ్యమా?" అన్నాను.

ఇమామ్ మాలిక్ చిరునవ్వుతో ఏదో రహస్యం చెబుతున్నట్లు చెప్పారు - "రాత్రి ఇషా నమాజు తరువాత నీ దగ్గరి నుండి లేచి వెళ్ళిన కొంతసేపటికి ఎవరో తలుపుతట్టి పిలిచారు. బయటికొచ్చి చూస్తే అబ్దుర్రహ్మాన్ బిన్ ఖాసిం. చేతిలో ఏదో సంచి ఉంది.

"అయ్యా! దయచేసి ఈ కానుకను తప్పక స్వీకరించండి" అని ప్రాధేయపడ్డారు.

నేను కాస్త మెత్తబడ్డాను. ఆ సంచిని నా చేతికందించి ఆయన తిరిగి వెళ్ళిపోయారు. లోపలికొచ్చి సంచి విప్పి చూడగా, వంద దీనార్లు ఉన్నాయి. 50 దీనార్లు నా ఆలు బిడ్డల కొరకు ఉంచుకున్నాను. మరో 50 దీనార్లు నీ కొరకు అట్టేపెట్టి తీసుకువచ్చాను, కాదనకు" అన్నారు.

కన్నీటి పర్యంతమయ్యాను. ఇమామ్ సాహెబ్ ఎంత విశాల హృదయులు! ఎంతటి ఔదార్యం! ఎంతటి దాతృత్వం! ఎంతో గొప్పవారు ఆయన! నా హృదయం ద్రవించింది. వారి మంచి మనసుకు నా మనసులోనే జోహారులర్పించుకున్నాను.

నాలుగు దీనార్ల అద్దెకు ఒంటెను కుదిర్చారు. నాలుగు దీనార్లు ఒంటె వానికిచ్చి మిగతా సొమ్ము నా చేతికి ఇచ్చారు.

మా బిడారం బయలుదేరింది. ఇమామ్ మాలిక్ (రహ్మ) గారు చాలా సేపటి వరకు అలా నిలబడి చూస్తూనే ఉన్నారు. దూరం పెరిగేకొద్దీ ఛాయామాత్రంగా కనిపించే ఆయన ఆకారం తగ్గుతూ ఉంది. చివరికి పూర్తిగా కనుమరుగయ్యారు కానీ హృదయంలో ఎంతో ఎత్తుకు, ఎదిగి, ఎదిగి నా మనసంతా నిండిపోయారు!

మా బిడారం నిరాటంకంగా ఎడారిలో పయనిస్తూనే ఉంది. ఇరవై నాలుగు రోజులు గడిచిపోయాయి. అప్పటికి 'కూఫా' దగ్గరపడింది. అసర్ నమాజ్ వేళ మేము కూఫాలోకి ప్రవేశించాము. నేను మస్జిద్‌కెళ్ళాను. అప్పుడే అసర్, సామూహిక నమాజ్ ముగిసింది. నమాజు తరువాత నేను మస్జిద్‌లో ఒక ప్రక్కకు చేరి కూర్చున్నాను. యాదృచ్ఛికంగా నా దృష్టి, నమాజ్ చేస్తున్న ఓ యువకునిపై పడింది. అతడు నమాజ్ సక్రమంగా చేయటం లేదని అనిపించింది. ఓ అడుగు ముందుకేసి అతన్ని వారిస్తూ – "తమ్ముడూ! నమాజు ప్రశాంతంగా, నెమ్మదిగా, సక్రమంగా చేయాలి సుమా! యాంత్రికంగా కాదు! దేవుడు నీ చంద్ర వదనాన్ని నరకాగ్ని నుండి రక్షించుగాక!" అంటూ హెచ్చరించాను.

అతడు నా వైపు తీక్షణంగా చూశాడు. నా హితబోధ అతనికి నచ్చినట్లు లేదు. "బహుశా నీవు హిజాజ్ (మక్కా, మదీనా, తాయిఫ్ ప్రాంతం) వాడివయి ఉంటావు. అవివేకం, కాఠిన్యం, హిజాజ్ వాసుల్లోనే అధికం. ఇరాక్ వాళ్ళ మంచితనం, మృదుత్వం, సహనం వారికెక్కడిది? అయినా వాళ్ళకా అదృష్టమా?" ఆగ్రహం పట్టలేక, రెచ్చిపోయి అక్కసు వెళ్ళగక్కాడు. ఇంకా తీవ్ర స్వరంతో "పదిహేనేళ్ళుగా నేనీ మస్జిద్‌లో నమాజ్

చేస్తున్నాను. అసలు ఇది ఎవరి మస్జిదో నీకు తెలుసా? అబూ యూసుఫ్‌ది, ముహమ్మద్ ఇబ్నె హసన్ లాంటి గొప్ప పండితులు ఈ మస్జిద్‌కి వస్తుంటారు. వారి వెంట, నేను నమాజ్ చేస్తుంటాను. ఈనాటి వరకు ఆ మహనీయుల్లో ఏ ఒక్కరూ నన్ను తప్పుపట్టలేదు. బయల్దేరాడు పెద్ద పండితుడు, నన్ను విమర్శించేందుకు." నిలువెల్లా ఉడికిపోతూ అరిచాడు. హేళనగా తన రుమాలు తీసి నా వైపు ఝూడించి ఏదేదో లోలోపల గొణుక్కున్నాడు.

అతని మాటలు నన్ను బాధించాయి. ఇమామ్ ముహమ్మద్ (రహ్మా), ఇమామ్ అబూ యూసుఫ్ (రహ్మా) గార్లు ఇంతకాలం ఇతన్ని అసలెందుకు వారించలేదో అని ఆశ్చర్యపోయాను.

దైవ వశాత్తు ఇమామ్ అబూ యూసుఫ్, ఇమామ్ ముహమ్మద్ ఇద్దరూ మస్జిద్ గుమ్మం దగ్గరే ఉన్నారు. ఆ యువకుడు వెళ్తున్నవాడల్లా వారిని చూసి ఆగిపోయాడు.

"గురువర్యా! ఎంత కాలంగా మీతో పాటు కలిసి, నేను నమాజ్ చేస్తూవున్నాను. మీరే చెప్పండి! నా నమాజ్‌లో ఏదయినా పొరపాటు జరిగేదా?" అడిగాడు ఆ యువకుడు.

"లేదే! దైవం సాక్షి! నీ నమాజ్‌లో మేమెన్నడూ తప్పులు చూడలేదు" యువకుణ్ణి సమర్థించారు నాయకులు ఇద్దరూ ముక్తకంఠంతో. యువకుడి స్వరం కూడా సంతోషంతో పెరిగింది.

"హిజాజ్ బాటసారి ఒకడు మస్జిద్‌లో వున్నాడు. నేను నమాజ్ చేస్తూ వుండగా చూసి తప్పుపడుతున్నాడు." అతని ఫిర్యాదులోనూ హేళన ధ్వనించింది. అది విన్న మహనీయులిరువురూ, "వెళ్ళు, - వెళ్ళి ఆ బాటసారిని అడిగిరా! నమాజ్ ప్రారంభించే పద్ధతి ఏదని" అని ఆ యువకుణ్ణి నా వద్దకు పంపించారు. అందుకు నేను రెండు ఫర్జ్‌లు, ఒక సున్నత్‌తో నమాజ్‌ని ప్రారంభించవలసి ఉంటుంది అని జవాబిచ్చాను.

నా జవాబుతో వారు నన్ను తేలిగ్గా అంచనా వేయకూడదని భావించారేమో మరో బాణం వదిలారు. "ఆ రెండు ఫర్జ్‌లు, ఒక సున్నత్ ఏవేవి?" అని అడిగి రమ్మన్నారు ఆ యువకునితో. అందుకు నేను,

"మొదటి ఫర్జ్ – నియ్యత్ లేక సంకల్పం!"

రెండో ఫర్జ్ – నమాజ్‌లోకి ప్రవేశించే తక్బీరె తహ్‌రీమా!

ఒక సున్నత్ – తక్బీర్ పలికేటప్పుడు రెండు చేతులెత్తడం" అని బదులిచ్చాను.

ఈ జవాబు అందగానే ఇమాం ముహమ్మద్, ఇమాం అబూ యూసుఫ్ ఇద్దరూ స్వయంగా నన్ను కలిసేందుకు మస్జిద్ లోపలికి వస్తూ దూరాన్నుండే నన్ను గమనించారు. నన్ను చూస్తే చిన్న పిల్లాడిలా కనిపించానేమో వారికి, మస్జిద్‌లో మరో ప్రక్కన కూర్చున్నారు. నన్నే తమ వద్దకు రావలసిందిగా ఆ కుర్రాడి చేత పిలువనంపారు. అతడేమో నన్ను ముద్దాయిని ఆజ్ఞాపించినట్లు పిలిచాడు. అతడు పిలుస్తుంటే నాకు వళ్ళు మండింది. నా 'పస' ఏమిటో తేల్చేందుకు పిలుస్తున్నారని గ్రహించాను. చెప్పొద్దూ! నాకయితే వాళ్ళ దగ్గరకు వెళ్ళేందుకు 'అహం' అడ్డువచ్చింది. నేను కూడా మొండిగా – "పో! వాళ్ళతో చెప్పు, దాహమయితే చెరువు దగ్గరకెళ్ళాలి గాని, చెరువు దాహార్తి దగ్గరకు రాదు, అయినా మీ పండితుల దగ్గరికెళ్ళి దేవురించాల్సిన ఖర్మ నాకేం పట్టింది?" నా స్వరం పెరిగింది. ముక్కు పుటాలెగిరాయి!

నా జవాబు విన్నంతనే ఆ యిద్దరు మహనీయులూ పాపం, లేచి నా వద్దకు వచ్చి 'సలాం' చేశారు. నేను కూడా లేచి నిలబడి ప్రతి సలాం చేశాను. చిరునవ్వుతో వారిని ఆహ్వానించి కూర్చోవలసిందిగా కోరాను. వారు ఇద్దరూ కూర్చున్న తరువాత నేను కూడా వారికి ఎదురుగా, కుదురుగా అణకువతో కూర్చున్నాను. ఇమామ్ ముహమ్మద్ సంభాషణ ప్రారంభించారు.

"మీరు హరమ్ నివాసులా?"

"అవునండి! నేను హరమ్ నివాసినే!"

"మీరు అరబ్బులా? లేక 'అజమ్' (అరబ్బేతరుల) సంతానమా?"

"అల్లాహ్ దయవల్ల నేను అరబ్బుల సంతానమే!"

"అరబ్బులా?"

"అవును, ముత్తలిబ్ సంతానంలోని వాడిని"

"ముత్తలిబ్ సంతానంలో ఏ శాఖ మీది?"

"షాఫియీ"

"మీరు హజ్రత్ మాలిక్ (రహ్మా)ని దర్శించారా?"

"అవునండి! వారి దగ్గర నేను కొన్ని నెలలు గడిపానండి. ప్రస్తుతం నేను అక్కడి నుంచే వస్తున్నాను."

"ఏమిటీ?! అలాగా? మీరు హజ్రత్ మాలిక్ (రహ్మా) సంకలనం చేసిన గ్రంథం 'ముఅత్తా' చూశారా?"

"చూడటమే కాదు! దేవుని దయవల్ల 'ముఅత్తా'ను పూర్తిగా కంఠస్థం చేశాను.

ఇమాం ముహమ్మద్ (రహ్మా) నా మాటల్ని అంత తేలిగ్గా నమ్మలేదు. వెంటనే వారు కాగితం, కలం తెప్పించారు. అందులో కొన్ని ప్రశ్నలు రాశారు. జవాబు రాసేందుకు గాను ప్రశ్నకు - ప్రశ్నకు మధ్యన ఖాళీ వదిలారు. ఆ సమస్యలను 'ముఅత్తా' వెలుగులో పరిష్కరించి జవాబులు వ్రాయవలసినదిగా ప్రశ్నా పత్రాన్ని నాకు అందించారు. ఆ కాగితాన్ని అందుకున్నాను. నేను దేవుని పేరుతో (బిస్మిల్లా) ప్రారంభించి, దివ్య గ్రంథం ఖుర్ఆన్ వెలుగులో, ప్రవక్త (సఅసం) సాంప్రదాయాల వెలుగులో, సహచరుల (రజి) సాముహిక అభిప్రాయం వెలుగులో వాటిని పరిష్కరిస్తూ జవాబులు వ్రాసి మరోసారి వాటిని పరిష్కరిస్తూ జవాబులు వ్రాసి మరోసారి దానిని పరిశీలించి ఇమామ్ ముహమ్మద్ చేతికి అందించాను. ఇమామ్ ముహమ్మద్ చాలాసేపు దాన్ని చూస్తూ ఉండిపోయారు. తరువాత నౌకరును పిలిచి నన్ను చూపిస్తూ వీరిని ఇంటికి తీసికెళ్ళమని చెప్పారు నన్ను ఉద్దేశించి.

"పదండి, నౌకరు వెంట మా పేదల ఇంటికి దయచేయండి" అన్నారు.

నేను ఎలాంటి సంకోచం లేకుండా నౌకరు వెంట నడిచాను. మస్జిద్ ముఖద్వారం వద్ద నన్ను ఒక నిమిషం నిలబెట్టి ఆ నౌకరు అలంకరించిన ఓ కంచర గాడిదను తీసుకువచ్చాడు. దానిపైకెక్కి నన్ను నేను ఒకసారి చూసుకున్నాను.

పాతబడిన చిరుగుల దుస్తులు చూసుకొని నేను సిగ్గుతో చితికిపోయాను. నా దారిద్ర్యం నన్ను వెక్కిరించింది. దారిలో నా స్థితికి నేను చాలా బాధపడ్డాను. నౌకరు కంచర గాడిద పగ్గం పట్టుకొని కూఫా నగర వీధులు, బజార్ల వెంట నడుస్తున్నాడు. నాకంటే నౌకరే నయం! శుభ్రమయిన బట్టలు వేసుకున్నాడు. నేను అతని దుస్తులను

నా పాత బట్టలను పదే పదే చూసుకుంటూ సిగ్గుతో తలవంచుకుని మరీ ఒదిగి కూర్చున్నాను. కొంత సేపటికి నౌకరు ఓ పెద్ద మహలు దగ్గర గాడిదను ఆపాడు. మహలు ద్వారాలు, ద్వారబంధాలు, కిటికీలు, అన్నీ 'నగిషీ' పనితో నిగనిగలాడుతున్నాయి. వాటి అలంకారం నాలాంటి హిజాజ్ నివాసికి వర్ణనాతీతం! ఈ వైభవం చూస్తుంటే నాకు 'హిజాజ్' వాసుల పేదరికం, దీనత్వం గుర్తుకు వచ్చాయి. అప్రయత్నంగా నా కళ్ళు చెమర్చాయి. ఈ స్థితిలో గుండెలోని బాధ గొంతుదాటి వచ్చింది.

"అయ్యో! ఇరాక్ వారు వెండి బంగారాలతో తులతూగుతూ ఉంటే హిజాజ్ వాళ్ళు కూటికీ, గుడ్డకూ మొహం వాచి జీవిస్తున్నారు. నాకు దు:ఖం ఆగలేదు.

అప్పుడే వచ్చిన ఇమామ్ ముహమ్మద్ (రహ్మా) గారి దృష్టి నా కన్నీటిపై పడింది. వారు నా బాధకు కారణం ఇంకో విధంగా ఊహించారు. నన్ను హాలులో కూర్చోబెట్టి మృదుస్వరాన – "తమ్ముడూ, ఈ నా వైభవం చూసి నీకు నాపై దురభిప్రాయం ఏర్పడిందేమో! మీరు చూస్తున్న ఈ కలిమి అల్లాహ్ అనుగ్రహం వల్ల, ధర్మసమ్మతమైన సంపాదనే. దీనికి సరయిన జకాత్ సక్రమంగా చెల్లించే సద్బుద్ధిని కూడా దేవుడు నాకు ప్రసాదించాడు. ప్రతి సంవత్సరం నా సంపదలో ప్రతి పైసా లెక్కగట్టి జకాత్ సక్రమంగా చెల్లిస్తున్నాను. జకాత్ గురించి మాత్రం నన్ను దేవుడు నిలదీయడని నా నమ్మకం! నా మిత్రులు నా స్థితిని చూసి సంతోషిస్తారు. నా శత్రువులు ఈర్ష్యపడతారు" అన్నారు. తరువాత ఆయన లోపలికెళ్ళి నా కొరకు విలువైన వస్త్రాల జత తెచ్చారు. "తమ్ముడూ! స్నానం చేసి ఈ బట్టలు ధరించు. ఇది తన తమ్మునికి ఓ అన్నయ్య ప్రేమతో ఇచ్చే కానుక!"

ఆ బట్టలు చూస్తేనే నా కళ్ళు చెదిరిపోయాయి. సుమారు వెయ్యి దిర్హములు ఖరీదు కాగల బట్టలవి.

నేను సంతోషంగా బట్టలు ధరించి వచ్చి కూర్చున్నాను. ఇమాం సాహెబ్ నాకు విసుగు కలగకుండా ఉండేందుకు తన పుస్తకాల అలమార నుండి "అల్ కితాబుల్ ఔసత్" తీసి ఇచ్చారు. "దీన్ని చదువుతూ ఉండండి – కాలక్షేపం అవుతుంది" అన్నారు. నేను పుస్తకం తీసుకొని ముందు, వెనుకలు, అటూ ఇటూ తిరగేసి చూశాను. చాలా నచ్చింది. దాన్ని పూర్తిగా మదిలో పదిల పరచుకోసాగాను. దేవుని అనుగ్రహం

వల్ల వేకువ ఝాముకు ముందు ముందుగనే పూర్తి గ్రంథం నాకు కంఠస్థమయింది. కాని ఇమామ్ ముహమ్మద్‌కు ఈ సంగతే తెలియదు.

ఆ రోజుల్లో 'కూఫా'లో ఇమామ్ ముహమ్మద్ గారే గొప్ప ధర్మవేత్తలు. ధార్మిక సమస్యలకు వారి పరిష్కారాన్ని అందరూ గౌరవించేవారు.

ఓ రోజు నేను వారి కుడి ప్రక్కన కూర్చొని ఉన్నాను. ఒక వ్యక్తి వచ్చి, ఇమామ్ గారికి ఒక ధార్మిక సమస్యను వినిపించాడు. ఇమామ్ గారు సమస్యను శ్రద్ధగా పరిశీలించారు. దీర్ఘంగా ఆలోచించారు. శాంతంగా జవాబిచ్చారు. "తమ్ముడూ! ఈ విషయంలో ఇమామ్ అబూ హనీఫా తమ అభిప్రాయాన్ని ఇలా వెలిబుచ్చారు ..." అని పరిష్కారం తెలిపారు. ఆ పరిష్కారంతో నేను ఏకీభవించలేకపోయాను.

"అయ్యా! మీరు పొరబడుతున్నారేమో! నిజానికి ఈ సమస్యలో ఇమామ్ అబూ హనీఫా అభిప్రాయం అందుకు భిన్నంగా ఉంది. వారు తమ గ్రంథం "అల్ కితాబుల్ ఔసత్"లో ఈ సమస్యకు పరిష్కారాన్ని ఫలానా అధ్యాయంలో ఫలానా సమస్యకు తరువాత ఫలానా సమస్యకు ముందు ఇలా వివరించారు ...."! అని నేనన్నాను.

ఇమామ్ ముహమ్మద్ (రహ్మ) చిన్నబుచ్చుకున్నారు. ఆశ్చర్య చకితులయ్యారు కూడా! వెంటనే గ్రంథాన్ని తెప్పించారు. ఆ సమస్యకు పరిష్కారాన్ని చూస్తే నా మాటే నిజమైంది. నిస్సంకోచంగా నా జవాబుతో ఏకీభవించారు. నా అసాధారణమైన ధారణశక్తి గమనించి ఆయన సంభ్రమంతో పాటు ఎంతో సంతోషించారు. వారి సాంగత్యంలో నేను చాలా రోజులే ఉన్నాను.

ఓ రోజు నేను ఇమామ్ ముహమ్మద్‌తో ఇలా అన్నాను, "గురువర్యా! మీ మంచితనం చూస్తుంటే మిమ్మల్ని వదలి ఎక్కడికీ పోబుద్ధి కావటం లేదు. కాని నా వృద్ధమాతను వదిలి ఆశించిన ఆ లక్ష్యసిద్ధి కొరకు మిమ్మల్ని మీ సాంగత్యాన్నీ వదలక తప్పటం లేదు. నాకు సెలవు ఇప్పించండి, మహాశయా!"

ఇమామ్ ముహమ్మద్ చిరునవ్వుతో –

"లేదు, లేదు తమ్ముడూ! మేము మా అతిథిని వెళ్ళనివ్వం" అన్నారు. నేను బ్రతిమిలాడుకున్నాను.

"మంచిది! అయితే ఓ షరతు! నా సంపదలో సగం నీవు తీసుకోవాలి" అన్నారు ఇమామ్ ముహమ్మద్!

"ఆచార్యా! మీకు తెలుసు కదా! నేను బయలుదేరింది ధన సంపాదనకు కాదని! నా గుండెల నిండా హదీసు విద్యాధనం నింపుకు రమ్మని నా తల్లి నన్ను పంపించారు. అందువల్ల మీరు నన్ను సంతోషంగా పంపించండి - అంతే చాలు. మళ్ళీ నేను విజ్ఞాన బాటనే పయనించవలసివుంది. నా కోరిక తీర్చవలసి ఉంది" అని దీనంగా అభ్యర్థించాను. ఇమామ్ ముహమ్మద్ మౌనంగా ఉండిపోయారు. ఇంట్లో వున్న డబ్బంతా తెప్పించారు. నగదు మూడు వేలు ఉంది. అంతా నాకిచ్చేశారు.

"గురువర్యా! ఇంతపెద్ద మొత్తం నేనేమి చేసుకోనూ?" అన్నాను. "ఫర్వాలేదు తమ్ముడూ! ఇది ఓ అన్నయ్య తన తమ్ముడికిచ్చిన కానుక. దీన్ని స్వీకరించి ప్రయాణంలో ఉపయోగించుకో" అన్నారు ఆప్యాయంగా!

నేను అక్కడి నుండి బయలుదేరి ఇరాక్, ఈరాన్ దేశాలలో ప్రతి నగరం తిరిగాను. హదీసువేత్తల జాడ తెలిసిన ప్రతిచోటికి వెళ్ళి వారిచెంత ఉన్నంత విద్యను అభ్యసించే ప్రయత్నం చేశాను. ఈరాన్ దేశమంతా గాలిస్తున్నప్పుడు నా వయస్సు 21 సంవత్సరాలు.

దేశాలు తిరుగుతూ తిరుగుతూ ఖలీఫా హారూన్ రషీద్ పరిపాలనా కాలంలో నేను ఇరాక్ చేరాను. రాజధాని అయిన బగ్దాద్‌కు వెళ్ళాను. దాని ప్రధాన ద్వారంలో అడుగుపెట్టాను. అంతే ఒక వ్యక్తి నన్ను ఆపి మృదువుగా అడిగాడు -

"అయ్యా! తమ నామధేయం?"

"ముహమ్మద్"

"తండ్రి పేరు?"

"మా నాన్నగారి పేరు - ఇద్రీస్ షాఫియి"

"మీరు ముత్తలిబ్ సంతానంలోని వారా?"

"అవునండి! నేను ముత్తలిబ్ వంశస్థుడనే!"

"ము ......... హ .......మ్మ.......ద్..... ఇబ్నె ఇద్రీస్..... షాఫియీ!

ముహమ్మద్ ఇబ్నె ఇద్రీస్ షాఫియీ! ...... విడివిడిగా తిరిగి మననం చేసుకున్నాడు నెమ్మదిగా. జేబు నుండి నోటు పుస్తకం తీశాడు. అందులో నా పేరు వ్రాసి, "ఇప్పుడు తమరు లోనికి దయచేయవచ్చు" అని అనుమతించాడు.

ఆలోచిస్తూనే నేను నగరంలో ప్రవేశించాను. బగ్దాద్‌లోని జామియా మస్జిద్ వెళ్ళి అక్కడే బసచేశాను. ప్రధాన ద్వారం దగ్గర నా పేరు వ్రాసుకున్న ఆ అపరిచితుని గురించే ఆలోచిస్తున్నాను. అతనెవరై ఉంటాడు? అతను నా పేరు ఎందుకు వ్రాసుకున్నాడు? దీని పర్యవసానం ఏమవుతుందో చూద్దాం! ఆలోచిస్తూ ఉండగానే నా కళ్ళు మూతలుబడ్డాయి. అర్ధరాత్రి దాటాక హఠాత్తుగా రాజభటులు దాడి చేశారు. మస్జిద్‌లో ఒక్కొక్కరినీ వెలుతురులో పరికిస్తున్నారు. ఇక నా వంతు వచ్చింది. నన్ను చూస్తూనే రాజభటులు తమకు కావలసిన వారు దొరికినట్లు సంతోషించారు. మిగతా వారిని కేకవేసి పిలిచారు -

"సోదరులారా! కంగారు పడకండి! మనం వెతుకుతున్న వ్యక్తి ఇక్కడే ఉన్నారు. అల్లాహ్‌కు కృతజ్ఞతలు" తిరిగి నాతో "పదండి - అమీరుల్ మూమినీన్ (ఖలీఫా) వద్దకు! పదండి" అన్నారు. నేనెలాంటి తిరస్కార భావం కనబరచలేదు. జంకూ గొంకూ లేకుండా వారిని అనుసరించాను.

అప్పటికప్పుడు రాజభటులు నన్ను హారూన్ రషీద్ కొలువులో ప్రవేశపెట్టారు. రాజదర్బారులో సింహాసనం మీద రాజఠీవితో హారూన్ రషీద్ ఆసీనులైవున్నారు. నేను లోపలకు ప్రవేశించి నిర్భయంగా, స్పష్టంగా గంభీరంగా -

"అస్సలాము అలైకుం" అన్నాను.

ఖలీఫా నన్ను మెచ్చుకున్నట్లుగా కనుబొమ్మలు ఎగరేసి - కూర్చోవలసినదిగా ఆసనం వైపు సైగ చేశారు. నేను నిర్మొహమాటంగా కూర్చున్నాను. సంభాషణ మొదలుపెట్టారు హారూన్ రషీద్.

"ఏమండీ - మీరు హాషిమ్ వంశస్థులా?"

"అవును - నేను హాషిమ్ వంశీయుడినే!"

"మీ పూర్తి వంశక్రమాన్ని తెలుపగలరా?"

"ఓ తప్పక - ముహమ్మద్ షాఫియీ - తండ్రి ఇద్రీస్ ..... ఆయన తండ్రి ఫలానా .... ఆయన తండ్రి ఫలానా ..... ఆయన తండ్రి ఫలానా .... ఆయన తండ్రి హజ్రత్ ఆదం అలైహిస్సలామ్" - చివరి వరకు గుక్క తిప్పుకోకుండా గడ గడా చెప్పేశాను.

హారూన్ రషీద్ ఆనంద, సంభ్రమాశ్చర్యాలతో "అల్ హమ్దులిల్లాహ్! ఈ వాక్చాతుర్యం, వాక్శుద్ధి, ఈ వాగ్ధాటి - నిస్సందేహంగా ముత్తలిబ్ సంతానానికే సొంతం" అన్నారు.

హారూన్ రషీద్ తిరిగి నాతో -

"నా రాజ్యంలో మిమ్మల్ని ముస్లిముల న్యాయాధికారిగా నియమించాలని అనుకుంటున్నాను. మీకు సమ్మతమేనా? ఖుర్ఆన్ ఆదేశానుసారం ప్రవక్త (సఅసం) సంప్రదాయానుసారం, ధర్మశాస్త్రాలనుసారం మనం ఇరువురం కలిసి ఈ రాజ్యాన్ని పరిపాలిద్దామా?" అన్నారు ఉద్వేగంగా.

నేను ఓ క్షణం ఆలోచించి, గుండెల నిండా ఊపిరి పీల్చుకొని ధైర్యంగా -

"అమీరుల్ మూమినీన్! క్షమించండి! ప్రస్తుత కాల పరిస్థితులలో నేను ఒక్క పూట కూడా ప్రభుత్వ న్యాయాధికారిగా అధికారం చెలాయించలేను" నిర్మొహమాటంగా అనేశాను.

నా నిర్ణయం వినగానే హారూన్ రషీద్ "అయ్యో!" అంటూ చాలా సేపటివరకు దు:ఖిస్తూనే ఉన్నారు. ఈ దృశ్యం చూసి దర్బారులోని వారు కలవరపడ్డారు. నా ప్రవర్తనే ఖలీఫా దు:ఖానికి కారణమని నా వైపు కోపంగా ఉరిమిచూశారు.

అమీరుల్ మూమినీన్ హారూన్ రషీద్ దు:ఖం కాస్త ఉపశమించిన తరువాత-

"నాయనా! ముహమ్మద్ షాఫియీ! మా కోసం, కనీసం మా తృప్తి కోసమయినా మీరు ఏదయినా వస్తువును కానుకగా స్వీకరించి మమ్మానందింపజేయలేరా?" గాద్గదిక స్వరంతో వేడుకున్నారు.

"సరే, అమీరుల్ మూమినీన్! ఏదో ఒకటి! దయచేసి త్వరగా ఇప్పించండి! నేను వెంటనే ఇక్కడి నుండి వెళ్ళిపోవాలి" అన్నాను త్వరపడుతూ!

హారూన్ రషీద్ దు:ఖిస్తూనే - తీసుకు రావలసినదిగా ఆజ్ఞాపించారు. వెంటనే వెయ్యి దిర్హములు తెచ్చారు. వాటిని పుచ్చుకొని సత్వరమే అక్కడి నుండి బయటకు వచ్చాను. నేను రాజదర్బారు నుండి బయటపడ్డానో లేదో ద్వారపాలకులు, నౌకర్లు సేవకులు నా చుట్టూ ఈగల్లా మూగారు. నాకు లభించిన బహుమతిలో తమకూ వాటా కావాలన్నట్లుగా నా వెంట పడ్డారు. బతిమిలాడసాగారు. వారిని వదిలించుకోవటం నాకు సులభమే అయినా, నా మనసు అందుకు అంగీకరించలేదు. వాళ్ళు ఎంతమంది వున్నారో అడిగి తెలుసుకొని ప్రతి ఒక్కరికీ సమానంగా పంచుకుంటూ వెళ్ళాను. వాళ్ళల్లో ఒక్కొక్కరికీ ఎన్నెన్ని దిర్హములు వచ్చాయో నా మూటలో చివరికి అన్నే మిగిలాయి.

దైవానికి కృతజ్ఞతలు తెల్పుకుని మిగిలిన ఆ కొన్ని దిర్హములు దగ్గరబెట్టుకొని తిరిగి బగ్దాద్ జామియా మస్జిదుకు చేరాను. కాస్త విశ్రమించానో లేదో ఉదయం నమాజ్‌కు అజాన్ ఇచ్చారు. ఎవరో ఓ యువకుడు ఉదయం నమాజ్ చేయించాడు. అతని ఖుర్‌ఆన్ పారాయణం నాకు చాలా నచ్చింది. ఖుర్‌ఆన్‌ను భావయుక్తంగా, సుమధుర స్వరాన పారాయణం చేశాడు. కాని పెద్దగా చదువుకున్న వాడిలా అనిపించలేదు. నమాజ్‌లో పొరపాటు చేశాడు. దాన్నెలా సరిదిద్దుకోవాలో అతనికి తెలియక, 'సహూసజ్‌దా' చేయకనే సలామ్ పలికి నమాజు ముగించాడు, అతనితో నేను - "తమ్ముడూ, నమాజ్ చేయించేవారు కనీసం నమాజ్ ధర్మాలు తెలుసుకొని వుండాలి కదా! ఇప్పుడు నమాజ్ నెరవేరలేదే! నమాజ్ తిరిగి చేయించాలి" అన్నాను.

అతను ఏమనుకున్నాడో ఏమోగాని మారు మాట్లాడకుండా నమాజ్ మళ్ళీ చేయించాడు. అతని సాధు స్వభావం, మంచితనం చూసి నాకు అతని యెడల సదభిప్రాయం కలిగింది.

"తమ్ముడూ, కాగితం, కలం తెప్పించుకో. 'సహూ సజ్‌దా' నియమాలు వ్రాసి ఇస్తాను. చదువుకుందువు గాని" అన్నాను. అతను కృతజ్ఞతాపూర్వకంగా వెళ్ళి వెంటనే కాగితం, కలం తెచ్చుకున్నాడు. దేవుడు నా మనసును విప్పారచేశాడు. అక్కడికక్కడే 'సహూసజ్దా' నియమాలు వివరంగా 40 పుటల ఓ చిరుపుస్తకం రాశాను. పుస్తకం తయారయింది. నేనతని పేరు అడిగాను. "జాఫ్రాన్" అని చెప్పాడు, ఈ పుస్తకం అతని కోసమే రచించాను గనక అతని పేరు మీదనే "కితాబుజ్జాఫ్రాన్" అని దాని పేరు పెట్టాను.

నా బగ్దాద్ నివాసానికి మూడు సంవత్సరాలు నిండాయి. హారూన్ రషీద్ అభ్యర్థన ఇపుడింకా అధికమయింది. ఏదో ఒక పదవిని చేపట్టి ప్రజలకు మేలు చేయవలసినదిగా పదే పదే నన్ను ప్రాధేయపడుతున్నారు. తుదకు మొహమాటంతో అంగీకరించవలసి వచ్చింది.

అమీరుల్ మూమినీన్ హారూన్ రషీద్ నన్ను 'నజ్రాన్'కు తహశిల్దారుగా నియమించారు. నేనక్కడ 'జకాత్' వసూలు చేయనారంభించాను. కాని నేను విద్యా పిపాసిని. తహశీలు పనిలో నా సామర్థ్యం, ఆసక్తి ఏముంటాయి? ఎలాగో కొన్నాళ్ళు గడిచాయి. హాజీలు హజ్ యాత్ర ముగించుకొని హిజాజ్ నుండి తిరిగి వస్తున్నారు. వారిని కలిసేందుకు వెళ్ళాలనుకున్నాను. నా శ్రేయోభిలాషి, మార్గదర్శి అయిన ఇమామ్ మాలిక్ (రహ్మ) గారి పరిస్థితి వారి ఇంటి యోగక్షేమాలు విచారించాలని అనిపించింది.

హజ్ యాత్రికులను కలిసేందుకు ఇంటి నుండి బయలుదేరాను. ఓ యువకుడు మదీనా నుండి తిరిగి వస్తున్నాడు. దూరాన్నుండే అతనికి నేను 'సలామ్' చేశాను చేతి సైగతో. అతడు ఒంటె నడిపేవానితో చెప్పి ఒంటెను ఆపి నా వైపు తిరిగాడు. నేను దగ్గరికెళ్ళి ఇమామ్ మాలిక్ (రహ్మ) యోగక్షేమాలు, మక్కా వారి పరిస్థితి వాకబు చేశాను.

"దేవుని దయవల్ల అందరూ బాగానే ఉన్నార"ని చెప్పాడా యువకుడు. అతని జవాబు నాకు సంతృప్తినివ్వలేకపోయింది. అందువల్ల మరలా ఇమామ్ మాలిక్ (రహ్మ) గారి గురించి అడిగాను.

"వారి గురించి క్లుప్తంగా చెప్పనా? వివరంగానా?" అడిగాడు.

"క్లుప్తంగానే తెలుపండి" అన్నాన్నేను.

"ఇమామ్ మాలిక్‌కేమండి! దర్జాగా ఉన్నారు. వైభవోపేత జీవితం గడుపుతున్నారు. వారిని అల్లాహ్ బాగా అనుగ్రహించాడు. బాగానే ఇచ్చాడు" వివరించాడు యువకుడు.

"ఏమిటి? ఇమామ్ మాలిక్ (రహ్మ) ధనవంతులయ్యారా?" విస్మయంగా తిరిగి అడిగాను.

"ఆ.. ఆ..! అవునండి! ఆధిపత్యం, అధికారాలతో శోభిల్లుతున్నారు. రాజఠీవితో వచ్చి మస్జిదె నబవిలో హదీసు విద్య నేర్పుతున్నారు" యువకుడు వివరించాడు.

నేను ఆలోచనలో పడ్డాను. నా మనసు ఆయన్ని కలవాలని ఉవ్విళ్ళూరుతోంది. ఆకలి దప్పులతోనున్న ఆ దైవదాసుని పరిస్థితిని నేను చూసేవున్నాను. ఇపుడు ఐశ్వర్యంలో ఇమామ్ మాలిక్ మనోస్థితి ఎలా ఉందో చూడాలి!

నా మౌనాన్ని చూసి అతడు గ్రహించాడు. నేను ఇమామ్ మాలిక్ (రహ్మా)ని చూడటానికి తహ తహ లాడుతున్నానని.

"అయ్యా! మీ ఎడబాటును ఇరాక్ ప్రజలు ఎంతమాత్రం భరించలేరు. నేనే మీ ఎడబాటును సహించలేను. తప్పనిసరిగా మీరు వెళ్ళదలిస్తే నా దగ్గరున్నదంతా మీదే అని భావించండి – స్వీకరించి ప్రయాణ సన్నాహాలు ప్రారంభించండి" అన్నాడు యువకుడు గౌరవాభిమానంతో. నగదుతో నిండిన ఒక సంచిని నా వైపునకు చూపి స్వీకరించండి అని ఇచ్చాడు.

"తమ్ముడూ! ఉన్నదంతా నాకిచ్చివేస్తే నీవేం చేస్తావు? నీ అవసరాలు కూడా వుంటాయి కదా!" మొహమాటంగా అన్నాన్నేను.

"నా గురించి మీరు విచారించకండి. నేను మళ్ళీ సంపాదించుకోగలను" ధైర్యం చెప్పాడు.

నాకు పైకంతో అవసరమున్నా ఆ విధంగా అతని దగ్గర తీసుకోవటం సముచితం కాదనిపించింది.

"పోనివ్వండి మీ అవసరం మేరకే తీసుకొని నన్ను ధన్యుణ్ణి చేయండి!" ఎంతగానో ప్రాధేయపడ్డాడు.

అతను అందించిన సంచిలో సగం స్వీకరించి "రబియా" వైపునకు పయనమయ్యాను.

కొన్ని రోజులు పయనించి, 'హోర్రాన్' గడ్డపై కాలు మోపాను. ఆ రోజు శుక్రవారం! శుక్రవారం తప్పక స్నానం చేయడం ప్రవక్త సంప్రదాయం! తల క్షవరం చేయించుకోదలచి అక్కడ దగ్గర్లో వున్న మంగలి వద్దకు వెళ్ళాను. మంగలి క్షవరం చేయటం మొదలు పెట్టి సగం గొరిగాడు.

ఇంతలో ఎవరో ఆ ఊరి మోతుబరి ఒకడు ఇతనికి కబురు చేశాడు, క్షౌరం కోసం! అతని పేరు వినగానే మంగలి నా ఖర్మకు నన్ను మధ్యలోనే వదిలి హడావిడిగా వెళ్ళాడు. నేను అచేతనంగా అలాగే ఉండిపోయాను. కొంతసేపటికి అతను వచ్చాడు. నాకు నచ్చ చెబుతూ "రండి! క్షవరం చేయించుకోండి. ఈ ఊళ్లోని ఓ గొప్పాయన పిలవనంపితే తప్పనిసరిగా వెళ్ళవలసి వచ్చింది" సమర్థించుకుంటున్నాడు.

నా అహం దెబ్బతిన్నది. ఎంత గొప్పాయన అయితే మాత్రం! నన్ను అరగుండు స్థితిలోనే వదలిపోవటమా!

"నా కొద్దులే పొమ్మ"ని తిరస్కరించాను. అయినా అతను నన్నేం లెక్క చేయలేదు. నన్ను పట్టించుకోకుండా ఇతర పనేదో చేసుకుంటున్నాడు. ఇక నా సహనం నశించింది. అయినా ఏం చేయగలను? బయటికి వచ్చేసి నా దగ్గరున్న నగదు మూట మొత్తం అతని వైపునకు విసిరేశాను.

"నీవు మూర్ఖంగా ప్రవర్తించావు. నన్ను అవమానించావు. జాగ్రత్త! ఇంకెప్పుడూ ఏ పరదేశిని అంత తేలిగ్గా అంచనా వేయకు" అన్నాను కోపంగా! వాడు అంత బరువైన నగదు మూటనూ, నన్నూ మార్చి మార్చి గుడ్లప్పగించి చూస్తున్నాడు. వాడి దుష్ప్రవర్తనకు నేను చీవాట్లు పెడుతుంటే ఏం చేయాలో అర్థంగాక బిక్క మొహం వేశాడు. జనం ప్రోగయ్యారు. తమాషా చూసేందుకు నాకు అవమానంగా వుంటే జనానికి తమాషాగా ఉంది. పైగా వాళ్ళు నన్నే విమర్శిస్తున్నారు. తలా ఓ మాట అంటున్నారు.

"ఈయనెవరో విచిత్రంగా ఉన్నాడే! మంగలికి ఇంత డబ్బు ఎవరైనా ఇస్తారా?" జనం రకరకాలుగా మాట్లాడుతున్నారు.

ఈ తమాషా జరుగుతూ వుండగనే క్షౌరశాల నుండి ఎవరో మోతుబరి బయటకు వచ్చాడు. గుర్రాన్ని సిద్ధం చేసి నౌకరు అతని ముందు ఉంచాడు. నా కేకలు విని వెంటనే గుర్రం దిగి నా దగ్గరికొచ్చాడు ఆ మోతుబరి.

"అయ్యా! తమరు షాఫియీ నా?"

"అవును, అవునండి నేను షాఫియీనే"

నా జవాబు విన్నంతనే అతను, "హజ్రత్, తమ పాదధూళితో దయచేసి మా

పేదయింటిని పవిత్రం చేయండి" అంటూ గౌరవ మర్యాదలతో గుర్రాన్ని నా ముందుకు తెచ్చారు. నేనేమాత్రమూ మొహమాటపడకుండా మారు మాట్లాడకుండా గుర్రాన్నెక్కి కూర్చున్నాను. నౌకర్లు తలవంచి కళ్లెం పట్టుకొని ఉన్నారు. అక్కడ తమాషా చూస్తున్న జనం ఈ దృశ్యం చూసి ఆశ్చర్యంగా నోళ్ళు తెరిచారు.

"ఎవరీ విచిత్ర పరదేశీ, ఎవరీ మహనీయుడు! పరదేశంలో సహితం తన సొత్తునంతా మంగలిపరం చేసిన భాగ్యశాలి ఎవరీయన? మన నగర కోటీశ్వరుడు తన స్వారిని, అతని సమక్షంలో సవినయంగా సమర్పించుకున్నాడు. అలాంటి వ్యక్తిని గురించి మనమెంత హేళనగా మాట్లాడాము!" నొచ్చుకున్నారు జనం!

కొద్దిసేపట్లో మేము ఆ భాగ్యవంతుని మహలుకు చేరాము. మరికొన్ని క్షణాల్లోనే ఆ ధనికుడు వచ్చేశాడు. అతని ఆనందం, ఆదర సత్కారాలు చూసి నేనాశ్చర్యపోయాను. ఎవరీయన? నన్నింతగా ఆదరిస్తున్నాడు? పైగా నా పేరెలా ఇతనికి తెలిసింది? నేను ఆశ్చర్యంలోంచి తేరుకోకముందే భోజనం సిద్ధమైంది. రకరకాల వంటకాలు వచ్చాయి. స్వయంగా ఆ ధనికుడే వచ్చి చేతులు కడుక్కునేందుకు పాత్రలో నీళ్ళు ఇచ్చాడు. చేతులు శుభ్రం చేసుకొని దస్తర్‌ఖాన్‌ను చేరాను. కాని చెయ్యి చాచి దేన్నీ తీసుకోలేదు. ధనవంతుడు ఆందోళనగా "అయ్యా! ఏమిటి? ఏమయింది? మీరు భోజనం చెయ్యరేమిటి? ఆరోగ్యమెలాగుంది?" అడిగాడు ఎంతో వినయంగా!

"నేను ఎంతమాత్రమూ తినను" అన్నాను కొంచెం వెనక్కు జరుగుతూ. ఆయన మరింత కలత చెందాడు. "అయ్యా! మీ అయిష్టతకు కారణమేమిటో దయచేసి సెలవీయండి" అన్నాడు.

"నన్నెలా గుర్తించారో పరిచయం ఎప్పుడయిందో చెప్పనిదే – నేను ఒక ముద్దయినా ముట్టను" అన్నాను బిగదీసుకుని. అతని మొహం మీద చిరునవ్వు చిందింది.

"ఓ! అదా! అదేం పెద్ద విశేషమండి! తమరు అప్పుడు బగ్దాదులో ఉండేవారు. ఆ రోజుల్లో తమరొక ఉత్తమ గ్రంథాన్ని రచించి, వినిపించారు. ఆ వినేవాళ్ళలో నేనూ ఒకణ్ణి! ఆ విధంగా తమరు నాకు గురువు! తమరిని గౌరవాదరాభిమానాలతో సత్కరించి, సేవ చేయటం నా విద్యుక్త ధర్మం!"

నా ఆనందానికి అవధుల్లేకుండా పోయింది! ఉన్నపళాన లేచి అతణ్ణి కౌగిలించుకున్నాను. ఆనందభాష్పాలతో కళ్ళు చెమర్చాయి.

"అవునయ్యా! విద్య వాస్తవంగా విజ్ఞాన ఖనుల మధ్య వారధిలాంటిది. అది ఎప్పటికీ శిధిలమవదు!" అన్నాను సంతోషంగా! ఇరువురం సంతోషంగా భోజనం చేశాము. నాకెంత సంతోషంగా వుందో దేవునికే తెలుసు!

నేనిపుడతనికి అతిథిని. ఏమాత్రం మొహమాటం, దాపరికం లేదు. అతని ఆతిథ్యంలో మూడు దినాలు గడిచాయి. నాల్గవరోజు మేమిద్దరం ఏదో మాట్లాడుకుంటున్నాము. ఉన్నట్లుండి ఆయన, "ఆచార్యా! 'హర్రాన్' చుట్టూ నాకు నాలుగు గ్రామాల స్థిరాస్తి ఉంది. అల్లాహ్ సాక్షి! ఆ నాలుగు గ్రామాలు సుభిక్షంగా ఉన్నాయి. వాటిని మీకు కానుకగా సమర్పిస్తాను. మిమ్మల్ని ఇక్కడే ఉంచుకోవాలని నా మనస్సు ఆకాంక్షిస్తుంది" అన్నాడు ఎంతో వినయంగా.

"నాలుగు గ్రామాలు నాకు ధారాదత్తం చేస్తే నీ జీవితమెలా గడుస్తుంది?" అన్నాను నేను.

"నా గురించి మీరు దిగులు పడకండి! ఇటు చూడండి. ఈ పెట్టెలో నాలుగు వేల దీనార్లు వున్నాయి. ఈ డబ్బుతో నేనేదయినా వ్యాపారం చేసుకొని బతగ్గలను!" అన్నాడు కృతనిశ్చయంతో.

"సంతోషం! కానీ తమ్ముడూ ప్రియమైన నా మాతృదేశం వదిలి ఊరూరా తిరిగేది ధన సంపాదనకు కాదు. వృద్ధురాలయిన మా అమ్మ ఆశీస్సులతో నేను ఇంటి నుండి బయలుదేరాను. ఆవిడగారి ఆశీర్వాదం, నేను దైవకృపతో విద్యాకాశాన నక్షత్రంలా ప్రకాశించాలని ఉంది" అని వివరంగా తెలిపాను.

"ఆర్యా! నిజానికి తమరు ఒక మహోన్నతమైన ఆశయం కొరకు పాటుబడుతున్నారు. అల్లాహ్ మీకు జయం చేకూర్చుగాక! మనోభీష్ట సిద్ధిరస్తు! ఆమీన్! అయితే ఓ చిన్న మనవి! కనీసం ఈ పైకమన్నా అంగీకరించండి. మీరు విజ్ఞాన మార్గాన పయనిస్తున్న ఓ బాటసారి కదా! ఈ పవిత్ర ఆశయం కొరకు మీరు ఎక్కడెక్కడ తిరగవలసి వస్తుందో తెలియదు. ఎలాంటి ఇబ్బందులు ఎదురౌతాయో తెలియదు. విలువలేని ఈ లోహపు నాణాలనయినా స్వీకరించండి" అన్నాడు మనస్ఫూర్తిగా.

అతని నిర్మల హృదయం, అభిమానం నన్ను కట్టిపడేశాయి. నేనతని కనీస కోరికను కాదనలేకపోయాను. ఆ నాలుగువేల నగదును స్వీకరించి యువకుడి వద్ద సెలవు తీసుకొని బయలుదేరాను.

హర్రాన్ నుండి నేను వీడ్కోలు తీసుకునేటప్పటికి నా ముందు వెనుకా బరువైన మూటలున్నాయి. తొలినాటి సంఘటన గుర్తుకు వచ్చింది. హర్రాన్‌లో అడుగుపెట్టేటప్పుడు నా నోట వెలువడిన మాట – "అల్లాహ్! నీవు నిరపేక్షాపరుడివి!"

ఎంతలో ఎంత మార్పు! ఆహా! నాలుగు రోజుల క్రితం నేను హర్రాన్‌కు రాగానే మంగలి నన్నెంతగా అవమానించాడు! మరి ఇప్పుడు వెళ్ళేటప్పుడో! ఎంత హుందాగా, ఎంత ఠీవితో, ఎంత దర్జాగా వెడుతున్నాను?! పైపెచ్చు ధనంతో నిండిన సంచులతో! కానీ క్షణమయినా నా మనస్సులో ధనాపేక్ష కలుగలేదు. దైవానికి కృతజ్ఞతలు.

ప్రయాణ మజిలీలలో ఇమామ్ అహ్మద్ ఇబ్నె హంబల్ కలిశారు. సుఫియాన్ బిన్ అయ్‌నియా కలిశారు. ఔజాయీ కూడా కలిశారు. ఇంకా హదీసు విద్యావేత్తలెందరో కలిశారు.

అందరికీ మనస్ఫూర్తిగా ఎంతో కొంత ధనాన్ని కానుకగా సమర్పించుకుంటూనే ఉన్నాను. 'రమ్లు' నగరానికి చేరేటప్పటికి నాలుగువేలకు బదులు నా దగ్గర పది దీనార్లు మాత్రమే మిగిలి వున్నాయి.

'రమ్లు'లో నేను బాడుగ సవారి తీసుకున్నాను. పాత మిత్రులు హజ్రత్ మాలిక్‌ని కలిసేందుకు 'హిజాజ్'కు బయలుదేరాను. మజిలీల తరువాత మజిలీలు దాటుకుంటూ ఆఖరుకు 27వ రోజు మహనీయ ముహమ్మద్ (సఅసం) గారి పవిత్ర నగరం మదీనా మునవ్వరా చేరాను. అపుడు అసర్ నమాజు ముగించుకున్నారు ప్రజలు. నేను నేరుగా మస్జిద్‌కెళ్ళి అసర్ నమాజు ముగించుకున్నాను. ఆశ్చర్యం! మస్జిద్‌లో ఎత్తయిన ఇనుప కుర్చీ ఒకటి ఉన్నతంగా ఏర్పరిచారు. దానిపై అందమైన పరుపు పరచి ఉంది. ఇరువైపులా మెత్తని మఖ్‌మల్‌తో తయారు చేసిన విలువైన ఈజిప్టు దిండ్లు అమర్చారు. ఆ ఆసనంపై ఈ వాక్యం సువర్ణాక్షరాలతో వ్రాసి ఉంది.

"లా ఇలాహ ఇల్లల్లాహ్ – ముహమ్మదుర్రసూలుల్లాహ్!"

ఉన్నతాసనానికి సంబంధించిన ఆశ్చర్యం నుండి నేనింకా తేరుకొనకముందే ప్రవక్త (సఅసం) పవిత్ర సమాధి ద్వారం వైపున నా దృష్టి మళ్ళింది. మాలిక్ ఇబ్నె అనస్ గారు అటువైపు నుండి రాజదర్పంతో వస్తున్నారు. మస్జిద్‌లో సువాసనలు

వ్యాపించాయి. ఇమామ్ సాహెబ్ వెనుక హదీసు విద్యార్థులు అనుసరించి వస్తున్నారు. బగ్దాద్‌లో హదీసు విద్యార్థులు 400 మందికి పైగా ఉన్నారు. నలుగురు వ్యక్తులు ఇమామ్ మాలిక్ (రహ్మ) చొక్కా చెంగును ఎత్తి పట్టుకొని తలలు వంచి నడుస్తున్నారు. ఇమాం గారు ఠీవిగా వచ్చి ఆసనాన్ని అలంకరించారు. ఒకసారి శిష్య సమూహము వైపు చూసి బోధించనారంభించారు. ఆ రోజు పాఠ్యాంశం "జర్హె అమద్" అనగా ఒక వ్యక్తి మరో వ్యక్తిని కావాలని గాయపరిస్తే ఉత్పన్నమయ్యే సమస్యలు – పరిష్కారాలు! నేనూ ఓ మూలన చేరి కూర్చున్నాను – ఇమాం గారి కంట పడకుండా.

ఇమామ్ మాలిక్ (రహ్మ) గారు "జర్హె అమద్"కు సంబంధించిన ఒక సమస్యను ప్రస్తావించారు. విద్యార్థులు ఆలోచిస్తున్నారు. నాకు దగ్గర్లోనే ఓ పామరుడు కూర్చొని వున్నాడు. నేను ఊరుకోలేక నెమ్మదిగా, ఆ సమస్యకు పరిష్కారం అతనికి అందించాను. పామరుడు ఇమామ్ గారి నుద్దేశించి నేను అందించిన జవాబిచ్చాడు.

ఇమాం సాహెబ్ మౌనంగా ఉండి మిగతా విద్యార్థుల జవాబు కొరకు ఎదురుచూస్తున్నారు. విద్యార్థులు తమకు తోచిన రీతిన పరిష్కారం తెలిపారు. అందరి జవాబు తప్పేనని, కానీ మొదట చెప్పినతని జవాబు సరిఅయినదని చెప్పి, జవాబును తిరిగి తన మాటలలో చెప్పారు ఇమామ్ మాలిక్. ఆ పామరుడు లోలోనే సంతోషించాడు.

ఇమామ్ సాహెబ్ రెండో సమస్యను విద్యార్థుల ముందుంచారు. విద్యార్థులు జవాబు కొరకు ఆలోచిస్తున్నారు. ఆ వ్యక్తి తిరిగి నా మొహం చూడడం మొదలుపెట్టాడు. నేను మొదటివలెనే జవాబు అందించాను. అతను అదే రీతిలో జవాబు చెప్పాడు. విద్యార్థులు తమకు తోచినదేదో చెప్పుకున్నారు. ఇమామ్ మాలిక్ అందరి జవాబులను జాగ్రత్తగా విన్నారు. "మీ అందరి జవాబులు తప్పు. కేవలం అతని జవాబు మాత్రమే సరయినది" అని చెప్పారు. ఆ వ్యక్తి మరింత సంతోషించాడు.

ఇమాం మాలిక్ (రహ్మ) మూడో సమస్యను లేవనెత్తారు. మళ్ళీ అదే పరిస్థితి ఎదురైంది. ఇపుడు విద్యార్థులందరూ ఆ వ్యక్తి వైపు పరీక్షగా చూస్తున్నారు. ఇమాం సాహెబ్ కూడా అప్రమత్తులయ్యారు. ఇమాం మాలిక్ "అబ్బాయి నా దగ్గరగా వచ్చి కూర్చో, ఆ చోటు నీకు తగదు" అని దగ్గరకు పిల్చుకున్నారు ప్రేమగా! ఆ వ్యక్తి నలుదిక్కులా పరికించి చూస్తూ బిక్కు బిక్కుమంటూ ఇమామ్ గారి దగ్గరకు వెళ్ళి కూర్చున్నాడు.

"నీవు 'ముఅత్తా' గ్రంథం చదివావా?" అడిగారు ఇమామ్ మాలిక్ సందేహంగా.

"ఇబ్నె జుగ్రీజ్ బోధనలు పరిశీలించావా" అడిగారు ఇమామ్ మాలిక్.

"లేదు – లేదండీ! నేను 'యిబ్నె జుగ్రీజ్' వ్రాసిన ఏ గ్రంథాన్ని చదవలేదండీ!" అన్నాడు బిత్తరపోతూ.

"నీవు 'జాఫర్ ఇబ్నె ముహమ్మద్ సాదిక్' గారిని కలిశావా?

"లేదండి! నేను వారిని చూడనేలేదు" అన్నాడు ఆ వ్యక్తి.

"మరి అయితే నీకు ఇంతటి ఉన్నత విద్య ఎలా అబ్బింది?" ఆశ్చర్యంగా అడిగారు ఇమామ్ మాలిక్.

ఇపుడతనికి కలవరం మొదలయింది. జవాబు ఏమి ఇవ్వాలో అయోమయంగా వుంది. చివరకు అసలు విషయం బయటకు చెప్పక తప్పలేదు.

"అయ్యా! నేను చెప్పిన జవాబులన్నీ నిజానికి నావికావు. విద్యా గంధాన్ని గుప్తంగా దాచుకున్న ఆ యువకుడు చెప్పినవే ఈ జవాబులు" అంటూ నా వైపునకు చూపించాడు.

అప్పుడు ఇటు తిరిగి నన్ను చూశారాయన. విద్యార్థులందరూ తలలు పైకెత్తారు. వారి కళ్ళన్నీ నన్నే చూస్తున్నాయి!

"వెళ్ళు – వెళ్ళి అక్కడ కూర్చున్న పండితుణ్ణి ఇటు పంపించు. నీవు అక్కడే కూర్చో" అన్నారు ఇమామ్ మాలిక్ ఆ వ్యక్తితో. అతడు నా దగ్గరకు వచ్చాడు. అతడు చెప్పకముందే నేనే లేచి ఇమామ్ మాలిక్ ఎదురుగా వెళ్ళి అణుకువతో కూర్చున్నాను.

ఇమాం మాలిక్ కాస్సేపు తదేకంగా నన్నే చూశారు.

"మీరు ముహమ్మద్ ఇబ్నె ఇద్రీస్ షాఫియీ కదూ?" అడిగారు.

"అవునండి. తమ గులాము షాఫియీనే?" అన్నాను నెమ్మదిగా!

ఇది విన్నంతనే ఇమామ్ మాలిక్ తమ ఆసనం నుండి లేచివచ్చి నన్ను అమాంతం కౌగిలించుకున్నారు.

"తమ్ముడూ! పద, ఆసనంపై కూర్చో. నేను మొదలుపెట్టిన పాఠ్యాంశం పూర్తి

చెయ్యి" అన్నారు ఆప్యాయంగా. వారి ఆదేశానుసారం నేను వెంటనే కుర్చీపై కూర్చొని "జర్హై అమద్"కు సంబంధించిన నాలుగువందల సమస్యలను వాటి పరిష్కారాలను విద్యార్థులకు బోధించాను. విద్యార్థులలో భయం, బిడియాలు అలముకున్నాయి, ఒక్క ప్రశ్నకు కూడా సరియైన జవాబు చెప్పలేకపోయారు. హజ్రత్ మాలిక్ నా వెన్నుతట్టి ఆనందాతిశయాన ఆశీర్వదించారు.

సూర్యాస్తమయం అయింది. మగ్రిబ్ అజాన్ ఇచ్చారు. అందరూ మగ్రిబ్ నమాజ్ ముగించుకున్నారు. హజ్రత్ ఇమామ్ మాలిక్ నన్ను చేయిపట్టుకొని అత్యంత ఆదరాభిమానాలతో తన ఇంటికి తీసికెళ్ళారు. అత్యంత వైభవోపేత మహలు చూసి నేను నిర్ఘాంతపోయాను.

"ఆచార్యా! అప్పటి పాత ఇల్లు ఎక్కడుంది?" అడిగాను.

"ఆ స్థలంలోనే దీని నిర్మాణం జరిగింది" జవాబిచ్చారు ఇమామ్ మాలిక్! ఒక ఆత్మీయుణ్ణి కోల్పోయినంత దిగులయింది. పరిమితమైన గది... కడుపు నిండని భోజనం... అయినా ఆప్యాయత, ఆత్మీయత! ఎంత అణచి పెట్టుకున్నా నాకు దు:ఖమాగలేదు. అప్రమేయంగా కన్నీరు వరదలైంది. హజ్రత్ మాలిక్ (రహ్మ) కూడా చలించిపోయారు. శోకతప్త స్వరంతో....

"తమ్ముడూ! - షాఫియీ! ఎందుకు దు:ఖిస్తున్నావు? ఏమిటి నేను ప్రాపంచిక వ్యామోహంలో పడి పరలోకాన్ని మరిచాననుకుంటున్నావా?" అన్నారు.

"అవును ఆచార్యా! ఆ ఉద్దేశ్యమే నన్ను వణికించి, అదుపు తప్పించింది" అన్నాన్నేను.

"షాఫియీ! నీవు నిజంగా నా హితైషివి, శ్రేయోభిలాషివి! అది నా అదృష్టం! నీలాంటి మిత్రులు నాకున్నంత కాలం నేను ఈ క్షణభంగురమైన ప్రాపంచిక వైభోగాల్లో మునిగి శాశ్వతమైన పరలోకాన్ని జారవిడుచుకుంటానా? ఎన్నటికీ కాదు! నీవు చూసే ఈ విలాసమంతా కేవలం అల్లాహ్ అనుగ్రహమే! ఇందులో నా ప్రయత్నం, ప్రమేయం ఏమీ లేదు. ఖురాసాన్, ఈజిప్టు తదితర దేశాల నుండి, ప్రపంచంలోని దూర దూర ప్రాంతాల నుండి, విద్యా ప్రేమికులు తమంతట తామే బహుమతుల రూపేణ ధనం పంపిస్తున్నారు. నీకూ నాకూ ప్రియాతి ప్రియులైన మహనీయ ముహమ్మద్ (సఅసం) కానుకలను తిరస్కరించలేదు, అందుకని కానుకలను తిరస్కరించలేక పోయాను.

"బంధువులు, మిత్రులు, అందరూ తృణమో పణమో ఎంతోకొంత బహుమతిగా పంపిస్తూనే ఉన్నారు. ఇలారా, ఇవన్నీ చూడు. ఈజిప్టు, ఖురాసాన్ దేశాల నుండి కొందరు పంపించిన వస్త్రాలు! ఒక దానికంటే మరొకటి విలువైనది. సుమారు మూడు వందల జతల బట్టలున్నాయి. దక్షిణ, బహుమతులు క్రమం తప్పక వస్తూనే ఉన్నాయి. ఇప్పుడు ఈ ఉడుపులన్నీ నీవే! మిత్రుని కానుకగా నీవు ఇవన్నీ స్వీకరించాలని నా కోరిక! ఇంకా విను, దయచేసి ఈ పెట్టెను చూడు. ఇందులో అయిదువేల బంగారు నాణేలున్నాయి. ఏటా భయభక్తులతో వీటిపై పూర్తిగా జకాత్ చెల్లిస్తున్నాను. ఇందులో కూడా సగపాలు నీవే!" అన్నారు హజ్రత్ ఇమామ్ మాలిక్.

ధనం నాకు కానుకగా ఇస్తున్నందుకు ఆయన ఎంతో సంతోషిస్తున్నట్లుగా ఆయన వదనం ప్రఫుల్లమయ్యింది. ఇమాం సాహెబ్ మాటలకు, చేష్టలకు నేను చేష్టలుడిగి రెప్పవేయటం మరిచాను. ఎంతటి మహనీయులు! ఎంతో గొప్ప విద్వాంసులే కాదు ... మరెంతో గొప్ప మనిషి! మహా మనీషి! వారి గొప్ప మనస్సుకు నేను ముగ్ధుడిని అవటం ఇది మూడో పర్యాయం! ఇలాంటి మహనీయులను ఈ లోకం ఎన్నటికీ లొంగదీసుకోజాలదు.

"గురువర్యా! నిర్మల హృదయంతో మీరు తెలిపిన కోరికను ఎలా కాదనగలను? మీ రుణం ఎలా తీర్చుకోగలను అన్నదే నా దిగులు. మీరు నాకు ధార్మిక జ్ఞాన సంపదను ప్రసాదించే వున్నారు. ఇపుడు ఐహిక ధనంతో సంపన్నుని చేశారు. అయితే నాదో మనవి. ఇస్లాం ధర్మ శాస్త్రానుసారం మీరు నాకు ఇవ్వనున్న ధనానికి ఒక పత్రం వ్రాసి ధృవీకరిస్తే ఉభయులకూ మేలు జరుగుతుంది. వారసులు మీకూ ఉన్నారు, నాకూ ఉన్నారు. ఒకవేళ నాకు కాలం తీరినట్లయితే ఈ ధనం పట్ల నా వారసులకూ మీ వారసులకు మధ్యన వివాదం ఏర్పడదు. ఒకవేళ దురదృష్టవశాత్తు మీ నిర్యాణం ముందు జరిగితే ఈ సంపదకు నేను హక్కుదారుడను అవుతాను. మీ వారసులు ఈ పత్రం ద్వారా అర్థం చేసుకొని నిశ్చింతగా వుంటారు. ఇమామ్ మాలిక్ మోముపై చిరునవ్వు వెలిగింది.

"తమ్ముడూ షాఫియీ! నీవు చాలా తెలివిగల వాడివి. నీ విద్య ఇక్కడ కూడా ఉపయోగపడింది" అన్నారు.

"గురువుగారూ! పరిజ్ఞానాన్ని ఉపయోగించుకునే అవకాశం దీనికి మించింది

ఏముంటుంది?" నవ్వుతూ అన్నాను నేను. వారు ఆ రాత్రికే 'ఆ పత్రం' వ్రాసి సాక్షి సంతకాలతో ధృవీకరించి నాకు ఇచ్చారు. ఆహా! ఎంత విచిత్రం! ఈ రాత్రికి రాత్రే ఈ నగర ధనికులలో నేనూ ఒకడిని అయ్యాను! ఉదయం ఇమామ్ మాలిక్ వెంట నమాజ్ చేశాను. నమాజ్ తర్వాత దైనందిన కార్యక్రమాలు ముగించుకున్నారు ఇమామ్ సాహెబ్. అనంతరం ఇమాం మాలిక్ నా చేయి పట్టుకొని ఆప్యాయంగా నన్ను ఇంటికి తీసుకెళ్ళారు ప్రేమ నిండిన హృదయంతో. నేను ఆయనతో స్వేచ్ఛగా మాట్లాడుతూ నడిచాను. ఇంటికి చేరేటప్పటికి ఆశ్చర్యంతో నోరు తెరవటం నావంతయింది. ఒక వైపు ఖురాసాన్ దేశపు దృఢమైన అశ్వాలు, మరోవైపున ఈజిప్టు దేశపు అందమైన కంచరగాడిదలు బారులు తీరి వున్నాయి. మేము ఇంట్లోకి వెళ్ళిపోయాము.

"మహాశయా! గుర్రాల మడిమల, గిట్టలు ఎంత అందంగా ఉన్నాయి! ఇలాంటి సుందర అశ్వాలు నేనింత వరకు చూడనేలేదు" అని నేనంటూ ఉండగానే వీటిని అన్నిటిని నీకు కానుకగా ఇస్తున్నాను" అన్నారు ఇమామ్ మాలిక్.

"అయ్యా! అన్నిటినీ నాకు ఇచ్చివేస్తానంటున్నారు. కనీసం ఒక గుర్రాన్నయినా మీరు ఉంచుకోండి మీ వాహనంగా" అన్నాను నేను. ఇది విన్నంతనే ఇమామ్ మాలిక్ ఆవేదన చెందారు.

"షాఫియీ! అల్లాహ్ ప్రేమపాత్రులు, మన నాయకమన్యులు, మన సర్వస్వం అయిన మహనీయ ముహమ్మద్ (సఅసం) ఈ పవిత్ర స్థలం క్రింద విశ్రాంతి తీసుకుంటూ ఉండగా, నేను ఆ నేలను గుర్రాల గిట్టలతో త్రొక్కించటమా? దైవం మన్నించుగాక! నేను సహించగలనా? నా ముఖం దైవానికి ఏమని చూపించను?" అంటూ చాలా సేపటి వరకు వెక్కి వెక్కి ఏడుస్తూనే ఉన్నారు. నా అణువణువూ ఆయన యెడల గౌరవభావంతో నిండిపోయింది. దైవ సందేశహరులు (సఅసం) ఘనత పట్ల ఆయనకు ఉన్న సాటిలేని గౌరవంతో ఆయన ముఖం తేజోవంతమయింది. నా దృష్టి మళ్ళించుకోలేకపోయాను. నా నేత్రాలు ఆనందభాష్పాలు రాలుస్తున్నాయి. నా చెవులలో ఇమామ్ సాహెబ్ మాటలు ప్రతిధ్వనిస్తున్నాయి. "షాఫియీ!.... ముహమ్మద్ ముస్తఫా (సఅసం) ఈ పవిత్ర నేల క్రింద విశ్రాంతి తీసుకుంటూ ఉండగా.... నేను .... ఆ నేలను గుర్రాల గిట్టలతో త్రొక్కించటమా?"

నాలుగవసారి కూడా నా హృదయం అంటున్నది "ఇమామ్ మాలిక్ మహా మనీషి! మాయాలోకపు దాడులు వీరిని ఎప్పటికీ జయించలేవు..."

ఇమాం సాహెబ్ (రహ్మ) గారి ఆదర సత్కారాలతో మూడు రోజులు గడిచాయి. నా వృద్ధ మాతృమూర్తి జ్ఞాపకాలు, మాతృభూమిపై ప్రేమ నన్ను మరీ మరీ వేధిస్తున్నాయి.

ఇంటి నుండి బయలుదేరి ఎన్నో సంవత్సరాలయింది. మా అమ్మతో ఇకనైనా కలసి ఉండాలనే కోరిక కలిగింది. ఒక పవిత్ర ఆశయంతో ఈ మొక్కను నాటారు మా అమ్మ. దీని పచ్చదనం కొరకు, ఎన్ని రాత్రులు మేలుకొని ఏకాంతాన అల్లాహ్ సమక్షంలో తన పైట చెంగును చాచి, కన్నీరు కార్చి, మొరపెట్టుకున్నారో! ఆనాడు అల్లాహ్ అనుగ్రహించాడు. అమ్మ ప్రార్థనా ఫలంగా ఈనాడు నా ఇహపర లోకాలు సుసంపన్నమయ్యాయి. దీనిని మా అమ్మ తన మసక కళ్ళతో చూసి పరవశించిపోవాలి!

నా ప్రగాఢ కోరిక ఇమామ్ మాలిక్‌ని అనుమతి కోరింది.

"మహాశయా! మా వృద్ధ మాతృమూర్తిని అతి త్వరగా కలుసుకోవాలని ఉంది. అహర్నిశలు ఆమె నన్ను గుర్తు చేసుకుంటూనే ఉంటారు. ఆమెకు శాంతి కరవయి వుంటుంది."

ఇమాం మాలిక్ అంతా విని నన్ను పంపేందుకు అనుమతించటమే కాక వెంటనే ప్రయాణ సన్నాహాలు చేయించారు. నేను ప్రయాణానికి సిద్ధమయి మూటా ముల్లె సర్దుకుంటుండగానే, ముందుగా ఒక మనిషిని 'మక్కా'కు పంపించారు – నా రాక తెలిపేందుకు. నా వెనుకా, ముందు ఖురాసాన్ గుర్రాలపై ఈజిప్టు కంచర గాడిదలపై బట్టల మూటలు, ధాన్యపు బస్తాలు, పైకం పెట్టెలు, దిర్హములు, దీనార్ల మూటలు వ్రేలాడుతున్నాయి. నేను దర్పంతో, అమితోత్సాహంగా పయనమయ్యాను.

నేను సంవత్సరాల తరబడి ప్రయాణం చేస్తున్నా ఈ ప్రయాణం మాత్రం నాకు సుదూరం, సుదీర్ఘం అనిపించింది. దారిలో నాకు ఒక్కొక్కసారి మక్కా వీధులు గుర్తుకు వస్తున్నాయి! ఒక్కొక్కసారి ప్రేమతో నిండిన అమ్మ పిలుపు గుర్తుకు వస్తుంది. అప్పుడప్పుడు స్నేహితులూ గుర్తుకు వస్తున్నారు. ఇలా నేను మాతృభూమికి చేరువవుతూ ఉన్నాను.

'మక్కా' పొలిమేరలకు చేరగానే కొందరు స్త్రీలు నా కొరకు ఎదురుచూస్తూ

నిల్చున్నారు. వయస్సు మళ్ళి బలహీనంగా ఉన్న మా అమ్మ తన ప్రేమహస్తాలతో, నన్ను గుండెలకు హత్తుకునేందుకు ఆత్రుత పడుతూ నిల్చున్నారు.

నేను దగ్గరికెళ్ళి గుర్రాన్నుండి క్రిందికి దిగగానే నన్ను కౌగిలించుకున్నారు మా అమ్మ. చాలాసేపటి వరకు ఆమె కళ్ళ నుండి ఆనంద భాష్పాలు ధారగా కురుస్తూనే ఉన్నాయి. తరువాత మా పిన్ని ముందుకు వచ్చారు. ఆవిడ కూడా నన్ను కౌగిలించుకొని నా నుదుటిని ముద్దాడి, ఆనందంలో ఆశువుగా ఒక కవిత కూడా వినిపించారు.

అది, మక్కా గడ్డపై నాకు లభించిన ప్రేమభరితమైన ప్రథమ పిలుపు! నాలో కలిగిన అప్పటి అనిర్వచనీయ ఆనందాన్ని ఎలా వర్ణించను?! తరువాత మక్కాలోని పురుషులు, స్త్రీలు, పిల్లలు అందరూ రాసాగారు. నేను తెచ్చిన విలువైన వస్తువుల వంక, మా అమ్మ వంక పదే పదే చూస్తూ అలాగే చాలాసేపు అక్కడే నిలబడిపోయారు. మా అమ్మ ఎందుకో దిగులుగా కనిపించారు. అందరూ సంతోషంగా ఉన్నారు. మా అమ్మ వదనాన ఎందుకో దరహాసమైనా కనిపించలేదు. వచ్చి చాలాసేపయ్యింది. నేను ముందుకు వచ్చి మా అమ్మ భుజాలు పట్టుకొని “ఇక వెళ్దాం పదమ్మా” అన్నాను ఆప్యాయంగా. మా అమ్మ దీర్ఘంగా నిట్టూర్చారు.

“ఎక్కడికెళ్దాం బాబూ?”

“ఇంకెక్కడికి! మన ఇంటికే!”

“షాఫియా! నీకు గుర్తుందా? నిన్ను వీడ్కోలు చెప్పిన రోజు నీకు గుర్తుందా నాయనా? ... నిన్ను పంపేటప్పుడు నా దగ్గర రెండే రెండు పాత దుప్పట్లు తప్ప మరేమీ లేవు. నీ ఆసక్తి గమనించి వాటిని నీకు ఇచ్చేశాను. అదేస్థితిలో నిన్ను ఇంటి నుండి పంపించాను. ప్రవక్త (సఅసం) హదీసుల విద్యా ధనంతో ధన్యుడవయి మరలి రావాలనే అభిలాషతో పంపించాను.

నాయనా! ఈ ఐహిక ధనం తెమ్మని నిన్ను పంపించానా? షాఫియా! ఇది వంచనలో పడవేసే సంపద! ఇతరుల కన్నా ఆధిక్యతలో ఉండాలని వీటిని తెచ్చావా? వారినందరినీ అల్పులుగా భావించనా?”

నన్ను మాట్లాడనివ్వకుండా, మెత్తగా చీవాట్లు పెడుతున్నారు మా అమ్మ. నేను నిరుత్తరుడనై అమ్మనే చూస్తున్నాను.

అల్లాహు అక్బర్! మా అమ్మ ఎంత మంచిది! ఎంత గొప్ప హృదయం! ప్రాపంచిక సంపదపై మమకారమే లేని మా అమ్మని ఏమని చెప్పను? అల్లాహ్‌పై ఎంత విశ్వాసం!

అలాంటి తల్లి కడుపున పుట్టిన నేనెంత భాగ్యశాలినో! అమ్మ మీద గౌరవభావంతో నా హృదయం పొంగిపొరలింది. నా నేత్రాలు వెచ్చని కన్నీటిని రాల్చాయి. అమ్మ సదాశీస్సులు, సదాశయం ఫలితంగానే నాకు ఇంతటి విద్యాధనం ప్రాప్తించింది. ఏళ్ళ తరబడి ఎంత నేర్చుకున్నా, ఈ ఇసుక దిబ్బల మధ్యన అమ్మ నేర్పిన గుణపాఠాలు నాకు ఎక్కడా లభించలేదు. ప్రేమాతిశయాన మా అమ్మగారి చేతులు కళ్ళకద్దుకొని ముద్దాడాను.

"అమ్మా! నన్నిపుడు ఏం చేయమంటారో ఆదేశించండి" అన్నాను వినయంగా.

"నాయనా! చేసేందుకేముంది? బహిరంగ ప్రకటన చేయి ... కావలసిన వారు వచ్చి ధాన్యం తీసుకోవచ్చని, అవసరమున్నవారు వాహనాలను, వస్త్రాలను తీసుకెళ్ళమని, ఇల్లు లేనివారు కావలసినంత డబ్బును కూడా తీసుకెళ్లవచ్చని ప్రకటించు."

నేను అమ్మగారి ఆజ్ఞానుసారం మక్కా వీధుల్లో ప్రకటన చేయించాను. కొద్ది సేపట్లోనే సంపద అంతా మక్కాలోని కూడు, గూడు, గుడ్డలేని వారికి పంచివేశాము. ఇపుడు నా దగ్గర ఒక కంచరగాడిద, యాభై దీనార్లు తప్ప మరేమీ మిగులలేదు. మేము మక్కా నగరంలోకి ప్రవేశిస్తూ ఉండగా నా కొరడా క్రిందపడిపోయింది. భుజాన కడవ ఎత్తుకొని వెనుక వస్తున్న ఒక బానిస స్త్రీ క్రిందపడిన కొరడాను వెంటనే తీసి నా చేతికి అందించింది. ఆమెకు బహుమతి యిద్దామని అయిదు దీనార్లు తీశాను. దాన్ని చూసి,

"షాఫయీ! నీ దగ్గర ఈ అయిదు దీనార్లే మిగిలాయా?" అంది అమ్మ.

"లేదమ్మా! ఇంకా నలభై అయిదు దీనార్లు ఉన్నాయి."

"అయితే వాటిని మరెవరి కొరకు అట్టిపెట్టావు?"

"అమ్మా! వాటిని మనకోసమే ఉంచుకున్నాను అవసరానికి ఉపయోగపడతాయని. ధాన్యం కూడా మనం మిగిల్చుకోలేదు గదా! బహుశా ఈ రోజే వాటి అవసరం కలగవచ్చు."

"ఒరేయ్! బాబు, కేవలం కొన్ని దీనార్ల మీద నీకు ఇంత నమ్మకముందే! సర్వస్వం ప్రసాదించే ఆ ప్రదాతపై నీకు విశ్వాసం లేదా? ఆశ్చర్యంగా ఉందే! తియ్యి తియ్యి, ఆ దీనార్లు అన్నిటినీ తీసి ఆ బానిస స్త్రీకు ఇచ్చెయ్యి" అన్నారు అమ్మ.

వెంటనే మిగిలివున్న దీనార్లనన్నిటినీ ఆ బానిస స్త్రీకి యిచ్చాను. ఇపుడు జేబులు ఖాళీ అయ్యాయి. అయితే నా హృదయం తృప్తితో నిండిపోయింది.

ఇంతటి సంతృప్తిని నేనెప్పుడూ ఎరుగను. అమ్మ అల్లాహ్‌కు కృతజ్ఞతలు సమర్పించి ప్రేమతో...

"నాయనా! నీవు ఎలా బయలుదేరావో అదే స్థితిలో ఇప్పుడు మన గుడిశెలో ప్రవేశిస్తున్నావు. కాని ఇవాళ నా గుడిశెలో ఎన్నడూ ఎరగనంతటి కాంతిపుంజాలు భాసిస్తాయి. షాఫియా! అల్లాహ్ నీనుదుటన జ్ఞాన తేజస్సునుంచాడు. నశ్వరమయిన ఈ ప్రాపంచిక విలాసాలు ఆ తేజస్సును మలినం చేయరాదని, తగ్గించనూరాదని నా ప్రగాఢ ఆకాంక్ష! బాబూ! నీకు గుర్తుందా? నిన్ను పంపించే సమయంలో ఏమని ప్రార్థించానో! నిన్ను విద్యాకాశాన ప్రభాకరునిలా మెరపించమని అల్లాహ్‌ను వేడుకున్నాను! ప్రాపంచిక ధన మేఘాలు ఆ నా ప్రభాకరుణ్ణి నిస్తేజం చేయరాదని నా మనోవాంఛ! నీ విజ్ఞాన కాంతి, ఇహంలోనూ ముస్లిం జగత్తును రుజుమార్గాన నడిపించాలి! పరంలోనూ ఈ వెలుగు నీకు ఉపయోగపడాలి. ఆమీన్" అన్నారు మా అమ్మ.

ఈ ఉదంతం, వార్తలా బహుదూర ప్రాంతాలకు పాకింది. హజ్రత్ ఇమాం మాలిక్ కూడా ఈ విషయం తెలుసుకున్నారు. ఆయన నాకు అభినందనలు తెల్పుతూ ఇలా లేఖ వ్రాశారు :

"నీవు అకుంఠిత దీక్షతో ప్రవక్త (సఅసం) బోధనల్ని సర్వత్రా వ్యాపింపజేయాలి. నీకు నేను ఇచ్చి పంపినంత సంపద, దైవచిత్తమయితే ప్రతి సంవత్సరమూ పంపించగలను."

అన్నట్లుగానే ఆయన ప్రతి సంవత్సరం షాఫియా (రహ్మ) గారికి ధనం పంపిస్తూనే ఉన్నారు. ఈ వ్యవహారం 11 సంవత్సరాల వరకు సక్రమంగా సాగింది. తరువాత ఇమామ్ మాలిక్ (రహ్మ) పరమపదించారు.

"ఇన్నాలిల్లాహి వ ఇన్నా ఇలైహి రాజిఊన్!"

అల్లాహ్ ఆయనపై కారుణ్య సుమాలు వర్షింపజేయుగాక! ప్రియప్రవక్త (సఅసం) బోధనల్ని అభ్యసించడంలో, విద్యావ్యాప్తిలో ఆయన తన జీవితం యావత్తు అంకితం చేశారు. అల్లాహ్ ఆయనకు పరలోకంలో ప్రవక్త (సఅసం) సన్నిధిని ప్రసాదించుగాక! ఆమీన్!

**- : సమాప్తం : -**